# సాగర సంగీతం

పేర్వారం జగన్నాథం




సాహితీ బంధు బృందం
(రిజిష్టర్డ్ నెం. 20/1981)
హనుమకొండ
వరంగల్లు

# అంకితం

కన్నతల్లి

శ్రీ. శ్రీ.

పేర్వారం సత్యమ్మకు

అమ్మా !

నీవప్పుడు మృత్యువుతో పోరాడుతున్న సమయం. నాకప్పుడు ఆరేళ్లుంటాయేమో ! ఒకనాటి రాత్రి - కారుచీకట్లు వర్షం మన ఇంటిపై కురుస్తున్నప్పుడు-అటు మరణ శయ్యపై నీవు-ఇటు ఆముదందీపపు క్రీనీడలో కూర్చుండి నేను-మంచు ముద్దలాంటి వెలుగులో పుస్తకంపట్టి "తల్లిని మించిన దైవం లేదు" అని చదువుతుంటే - నీ గుండెలో బ్రద్దలైన అగ్నిపర్వతాలనూ పొంగిన విద్యుత్ కాసారాల కల్లోలాలనూ అణచుకుంటూ-ఆపుకుంటూ "నాన్నా నా ముందు చదువకు నీ భవిష్యత్తును చూడడానికి నేను నోచుకోలేదు" అంటూ దీనంగా పగిలిన కంఠంతో పలికిన నాటి నీ వేదనకు-
నా ఈ "సాగర సంగీతం"

నివేదన

— పేర్వారం జగన్నాథం




# ఏంతో ఒక మాట

శ్రీ పేర్వారం జగన్నాథం గారి "సాగర సంగీతం" కావ్యాన్ని పునర్ముద్రించే అవకాశం మాకు లభించినందుకు ఎంతో సంతసిస్తున్నాం. ఈ సందర్భంలో వారికి మా కృతజ్ఞతలందజేస్తున్నాం. దీన్ని హైదరాబాదులోని "నవ్యసాహితీ సమితి" ఆగష్టు 1960లో మొదటిసారిగా ముద్రించింది. ఆనాడు దీని ఆవిష్కరణ సభ ది. 5-9-1960 నాడు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం–హైదరాబాదులో ఏర్పాటు చేయబడింది. సాహిత్య భీష్మాచార్యులు కీ. శే. శ్రీ తాపీధర్మారావుగారు అధ్యక్షత వహించి సభకు అందం పెంచినారు. కళాప్రపూర్ణ, ఆస్థానకవి డా॥ దాశరథిగారు కావ్యాన్ని ఆవిష్కరించి కవితా కళా రహస్యాలను పంచిపెట్టినారు. ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు కావ్య సమీక్షచేసి కవిని ఆశీర్వదించినారు. అది జరిగి ఇప్పటికి రెండు దశాబ్దాలు గడిచిపోయినాయి. ప్రథమ ముద్రణ జరిగిన కొద్దికాలానికే ప్రతులు చెల్లిపోయినాయి. అందువల్ల ఈ ద్వితీయ ముద్రణ అవసరమైంది. ఆలస్యంగానైనా దీన్ని చేపట్టడం సాహిత్యోపాసకులకు సంతోషకారణమవుతుందని విశ్వసిస్తున్నాం.

ఐతే ఇందులోని చివరి ఆరు రచనలు–ఆశాకిరణం, వర్షబిందువు, ప్రతిజ్ఞ, ఏడుకొండలా యెంకన్నా, అగ్రరాజ్య చతుష్టయం., కన్నీటి కథ అన్నవి ప్రథమ ముద్రణలో చోటుచేసుకోలేదు. ఇవి కూడ రచయిత విద్యార్థిదశలో రాయబడినవే కనుక ఈ ద్వితీయ ముద్రణలో చేర్చడం సముచితంగా ఉంటుందని భావించినాం. వీటితో కలిపి మొత్తం ముప్పైయారు ఖండికలతో ఈ "సాగర సంగీతం" కావ్యాన్ని మీకందిస్తున్నాం. ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

ప్రథమ ముద్రణకు మాదిరిగానే ఈ ద్వితీయ ముద్రణకున్నూ అన్ని విధాలా ప్రోత్సాహాన్ని అందించిన సహృదయులూ, సాహితీప్రియులూ శ్రీ చింతకుంట్ల వెంకటరామా రెడ్డి (కొత్తపల్లి గ్రామం, జనగామ తాలూక) గారికి మా ధన్యవాదాలు.

అందంగా ముద్రించి సకాలానికి అందించిన లక్ష్మీ ప్రింటింగ్ ప్రెస్ సిబ్బందికీ, దాని అధిపతి శ్రీ సి. హెచ్. రాజా రెడ్డి గారికీ మా కృతజ్ఞతలు.

ది. 23-8-1981
దుర్మతి, శ్రీకృష్ణ జయంతి

సాహితీ బంధు బృందం

# మనసులోని మాట

నా ఈ "సాగర సంగీతం" ద్వితీయ ముద్రణ పొందుతున్న సమయాన కొన్ని విషయాలు చెప్పడం అవసరంగా భావిస్తున్నాను. దీనిలో సంకలితం చేసిన కవితలన్నీ నేను విద్యార్థిగా ఉన్న రోజుల్లో అంటే - ఇంటర్మీడియేట్, బి. ఏ; ఎం. ఏ. చదువుతున్నప్పుడు రాసినవి. నేను వరంగల్లు కళాశాలలో ఇంటర్మీడియేట్ చదువుతున్న కాలంలో (1953-55) ఆంధ్రోపన్యాసకులుగా ఉన్న "శిరోమణి" కీ. శే. శ్రీమాన్ చెలమచర్ల రంగాచార్యులు గారు మాకు సాహిత్యంపై ఆసక్తిని పెంపొందిస్తుండేవారు. ఆ రోజుల్లోనే "తెలుగుదేశం" పత్రికా సంపాదకురాలు శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి గారు మా కళాశాలను సందర్శించి, తమ పత్రికకు రచనలు పంపించవలసిందిగా విద్యార్థుల్ని కోరి ఉండిరి. ఆ మేరకు నేను నా రచనల్ని "తెలుగుదేశం" పత్రికకు పంపిస్తూ ఉండడం, అందులో అవి అచ్చుకావడం జరుగుతుండేది. అట్లా ప్రారంభమై అచ్చైన నా మొట్టమొదటి కవిత "ఆశాకిరణం" అన్న శీర్షికతో ఇప్పుడిందులో ఉన్నది. ఈ సమయంలోనే మా కళాశాలకు చెందిన కొంతమంది విద్యార్థులం కలిసి "సాహితీ బంధు బృందం" అన్న పేరుతో ఒక సాహిత్య సంస్థను స్థాపించుకున్నాం. దాని తొలి ప్రచురణగా "తొలికారు" (యువకవుల కవితా సంకలనం) వెలువడింది. అందులోనూ "ఆశాకిరణం" అన్న నా మొదటి కవితతోపాటు "వర్షబిందువు" అన్న నా మరో కవిత కూడ అచ్చైంది. ఇట్లా నాలోని కవితాత్మకు ఈ విధంగా నాడు ప్రేరణ కలిగింది.

ఇందులోని రచనలు కొన్నింటికి కొంత చరిత్ర ఉన్నది. ఇక్కడ దాన్ని ఉల్లేఖించడం అసందర్భం కాదనుకుంటాను. దీనిలోని "బహురూపుల వేషాలు", "ప్లేటు ఫిరాయింపు" అన్న కవితలు పరిజాకంటుకుడైన విస్నూర్ దేశముఖునుద్దేశించి రాసినవి. రెండవ సార్వత్రిక ఎన్నికల సమయంలో పోటీచేయడానికి ఆయనకు అధికార పార్టీ టిక్కెట్టు లభించినట్లు పత్రికల్లో వార్త వచ్చింది. అది తెలిసి నా రక్తం తుకతుక ఉడికింది. గుండెలోతుల్లోంచి ఉష్ణగుండం పొంగింది. అదే కవితగా మారింది. వెంటనే జనగామ నుండి వెలువడే "వెలుగు" "తెలుగుజ్యోతి" పత్రికలకు పంపించినాను. వెంటనే అవి ప్రచురించి ప్రజావాణిని పలికించినాయి.

"ఏడుకొండలాయెంకన్నా" అన్న రచన విశాలాంధ్రోద్యమాన్ని సమర్థిస్తూ రాసింది. 1955-56 ప్రాంతంలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమకారులు విశాలాంధ్ర సభస్సుల్ని భగ్నంచేస్తుండేవాళ్లు. ఒకనాడు జనగామలోనూ విశాలాంధ్ర సదస్సు

ఏర్పాటు చేయబడింది. స్వాతంత్ర్య సమరయోధుడూ "వెలుగు" పత్రికా సంపాదకుడూ అయిన శ్రీ చౌడవరపు విశ్వనాథంగారు దానికధ్యక్షులు. నేను కూడ మా ఊరివాళ్లతో బయలుదేరి వచ్చి, ఆనాటి ఊరేగింపులో పాల్గొని, విశాలాంధ్ర సభస్థలో ఈ గేయం గానం చేసినాను. ప్రజలు కరతాళ ధ్వనులు చేస్తూ ఆ గేయాన్ని నాచే మళ్లీ మళ్లీ చదివించినారు. సమావేశానంతరం ఇవతలికి రాగానే నాపై చేయిచేసుకోవడానికి కొందరు ప్రయత్నించినారు. ఐతే నావెంట మా ఊరికి చెందిన నా బాల్య మిత్రులూ, నిజాం రాచరికానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం చేసిన శ్రీ పెరుమాండ్ల యాదగిరి, శ్రీ గజ్జుల వీరయ్య గారలు నన్ను ఒక హోటల్లోకి తీసుకవెళ్లి రక్షణ కలిపించినారు. ఈ గేయంపై కీ.శే. శ్రీ అడవి బాపిరాజుగారి "గంగిరెద్దు" కీ. శే. శ్రీచొల్లేటి నృసింహ శర్మగారి "గంగిరెద్దు" అన్న గేయాల ప్రభావం ఉంది. ఈ గేయంలోని కామాలలో ఉంచబడిన పదాలు ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని నడిపించిన కొందరు ప్రముఖ వ్యక్తులనూ, పత్రికలనూ, స్ఫురింప జేస్తాయి.

"ఆశాకిరణం" అన్నగేయం నా తమ్ముడు శ్రీ పేర్వారం రాములు ఐ.పి.యస్.కు బాల్యవివాహమొకటి జరుగనున్న సమయంలో కోర్టుద్వారా నేను వివాహాన్ని ఆపి వేయించిన సందర్భంలో రాసింది. శారదా చట్టం ప్రకారం బాల్యవివాహాన్ని ఆపడం కోసం, నేను జనగామలోని కోర్టునుకోరడం, వెంటనే కోర్టునుండి మా నాయనగారికి వివాహాన్ని ఆపవలసిందిగా ఆదేశాలు వెళ్లడం ఒక్కరోజులో జరిగింది. దానితో మా బంధువర్గమంతా నాపై మండిపడినారు. నన్ను గట్టిగా మందలించినారు. నన్ను సమర్థించే వాళ్లు ఒక్కరూ కనిపించలేదు. ఏకాకినై పోయినాను. ఆ సమయంలో ఒకానొక నిరాశా పూరిత భయానక మనస్థితితో రాసిందీ గేయం. అప్పుడు నేను ఇంటర్మీడియేట్‌లో ఉన్నాను. ఐనా కొన్నాళ్లకు నన్నందరూ మెచ్చుకోవడం ప్రారంభించినారు. అంతేకాదు అదొక సాహసోపేతమైన చర్యగా హాస్యపూరిత కథగా ఇప్పటికీ చెప్పుకుంటూ నవ్వుతుంటారు.

"అగ్రరాజ్యచతుష్టయం" అన్నరచన కళాప్రపూర్ణ, ఆచార్య శ్రీ సి. నారాయణ రెడ్డిగారి "చంద్రబింబం ఆరిపోతే, జగత్తు చిత్రంగా ఉండదూ" అన్న కవితకు పేరడీగా రాయబడింది. ఇందులో అగ్రరాజ్యాలు ప్రపంచ రాజకీయాలను నడిపిస్తున్న తీరును చిత్రించడమే నా ఉద్దేశం. రెడ్డిగారి గేయాన్ని ఈ విధంగా అనుసరించినందులకు వారికి నా కృతజ్ఞతలు.

"ప్రసవ వేదన" అన్న కవిత ఆంధ్రాభ్యుదయోత్సవాల సందర్భంలో ఏర్పాటు చేయబడిన కవి సమ్మేళనంలో మొదటిసారిగా చదువబడింది. నాటి సభకు అధ్యక్షత

వహించిన సహృదయులు డా॥ దాశరధిగారు నన్నెంతో మెచ్చుకున్నారు. సభాసదులంతా విరగబడి నవ్వినారు. సెటైర్ కవితకు నేను తగుదునన్న భరోసా కలిగించినారు.

"మహా విష్ణువు మరణం" అన్న రచన చదివినప్పుడల్లా పూజ్యులూ సుప్రసిద్ధ పరిశోధకులూ అయిన శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారు కేవలం పరిహాసంకోసం నాతో "మా విష్ణువును అన్యాయంగా చంపేశావు. శివుణ్ణి చంపేయ వలసింది" అంటూ చిరునవ్వుతో పలుకుతుండేవారు. "శివుడు మృత్యుంజయుడు కదా" అంటూ నేను సమాధానం చెప్పేవాణ్ణి.

"సాగర సంగీతం" కావ్యానికి (ప్రథమ ముద్రణ) పీఠిక రాయవలసిందిగా ఆత్మీయులూ, ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగారిని కోరినప్పుడు—నాలో అప్పుడప్పుడే మొగ్గదొడుగుతున్న సెటైర్ లక్షణాన్ని అందరికన్న ముందుగానే పసిగట్టి నా బుజంతట్టి ముందుకు నడిపించినారు.

దీన్ని మొదట "నవ్య సాహితీ సమితి" పక్షాన ప్రచురింపించి నా కవితా వికాసానికి దోహదం కలిగించినవారు కళాప్రపూర్ణ శ్రీ బోయి భీమన్న M.L.C. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారలు.

ఆనాడు కావ్యముద్రణతో పాటు కావ్యావిష్కరణ సభదాకా నాకు చేదోడు వాదోడుగా ఉండి నా గుండెలో గూడుకట్టుకున్న కవిమిత్రుడు శ్రీ జె. బాపురెడ్డి ఐ. ఏ. యస్. గారు.

ప్రథమ ముద్రణకే కాకుండా, ఈ ద్వితీయ ముద్రణకున్నూ అన్నివిధాలా సహకరించి, సదా నా అభ్యుదయాన్ని కాంక్షిస్తున్న నా చిన్ననాటి మిత్రుడు శ్రీ చింతకుంట్ల వెంకటరామారెడ్డిగారు.

ఇట్లా ఎందరో పెద్దలు, మిత్రులు, సాహితీవేత్తలు ప్రత్యక్షంగానేకాకుండా పరోక్షంగానూ నన్ను ప్రోత్సహిస్తూ నా సాహిత్య వ్యాసంగానికి దోహదం కలిగిస్తున్నారు. అందరికీ వందనాలు.

ది. 23-8-1981
దుర్మతి, శ్రీకృష్ణజయంతి

పేర్వారం జగన్నాథం

# ప రి చ యం

నవ్య సాహితీసమితి అనుబంధ కావ్య పరంపరలో ఇప్పుడు మరొక కొత్త తరంగాన్ని సహృదయలోకానికి అందజేస్తున్నందుకు ఎంతోసంతోషంగా ఉంది. ఈనూతన కావ్యంలోగల ముప్పైఖండికలుముప్పైరకాల అందచందాలతో,అనుభూతులతోఅలరారుతు ఆనందాన్ని అందిస్తున్నాయంటే అతిశయోక్తికాదు. రచయిత శ్రీ పేర్వారంజగన్నాథంగారు ఉత్సాహంగా ముందుకు వస్తున్న తెలుగు యువ కవులలో ఒకరు. మాతృభాష మరాఠీ అయినా తెలుగులో ఎం.ఏ. పట్టభద్రులై సాహితీ క్షేత్రంలో కృషీవలులు కావడం అభినందనీయం.

వివిధపత్రికలలో అప్పుడప్పుడు ప్రకటితాలైన కావ్యఖండికలను సంపుటీకరించి ఈ 'సాగర సంగీతం'గా ప్రకటిస్తున్నందుకు 'నవ్యసాహితీ సమితి' సంతోషిస్తున్నది. ఈ కావ్య సంపుటి పాఠకుల ఆదరణకు పాత్రం కాగలదని ఆశిస్తున్నాం

హైదరాబాదు
10-8-1960

బోయి భీమన్న
పోతుకూచి సాంబశివరావు
అధ్యక్ష కార్యదర్శులు,
నవ్య సాహితీ సమితి

# ఆశీస్సులు

శ్రీ పేర్వారం జగన్నాథంగారు వ్రాసి ప్రకటించిన 'సాగరసంగీతం' అనే గేయ సంపుటమునుచూసి సంతసించినాను. వీరు విద్యార్థి దశనుండియు సాహిత్య కార్యక్రమముల లోను, శక్తి కొలది సాహిత్య నిర్మాణంలోను కృషి చేయుచుండుట యెరుగుదును. వీరి సాహిత్యాభిరుచి పెంపొంది, ఉత్తమ మార్గముల పరిమళించుగాక యని ఆశీర్వదించు చున్నాను.

హైదరాబాదు
12–8–1960

ఖండవల్లి లక్ష్మీరంజనం
ఆంధ్రశాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

శ్రీ పేర్వారం జగన్నాథం ఎం.ఏ. గారు రచించిన ఖండకావ్య సంపుటిని చూచి ఆనందించితిని. ఇందు ముప్పది ఖండకావ్యములున్నవి. అందు పెక్కు అభ్యుదయ మార్గము ననుసరించునట్టివే. అన్ని కావ్యములందలి భావములును గంభీరోదాత్తములై యున్నవి. కొన్ని వ్యంగ్య ప్రధానములై యుండుటచేత నాలోచించిన విమ్మట కాని అర్థముకావు. కొన్ని కావ్యాలు కవి దేశభక్తిని, జాతీయ భావ సంపదను ప్రకటించుచున్నవి. బహురూపుల వేషాలు, ఆషాఢ పయోదం, మహావిష్ణువు మరణం, దివాంధముల స్వగతం మున్నగు కావ్యాలు ఉదాత్తభావ బంధురములై మనోహరముగా నున్నవి. గేయములు సర్వత్ర ధారాశుద్ధికల్గి పాడుట కనువై ఉన్నవి. భాష వ్యావహారికమును, పరభాషాపద సంపృక్తమునయ్యు, ప్రసన్నమై మధుర మంజులముగా నున్నది. ఈ సంపుటి ఆకృతిని చిన్నదయ్యు కవి ముందు రచింపబోవు మహాకావ్యములకు మూదలగా నున్నది. గావుకేకలోని "ఔన్నత్యమును జూచి హర్షించలేరు మరి, నాదీనతను జూచి నవ్వ కొందురుగాని" అన్నగేయం నన్ను చాలఆకర్షించినది. ఇట్టివి అన్నికావ్యములలోను బహుళముగా నున్నవి.

హైదరాబాదు
4–8–1960

డా॥ దివాకర్ల వేంకటావధాని
రీడర్–తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం

అనేక విధాలు మనస్తత్వాలు. కాలకూటమునైనను కంఠములో నొక్కికొని కిక్కురుమనక ఊరుకోగలవారేకారు, వాయి పట్టినన్ని వాత వేసికొని గుటుక్కున మ్రింగి వాతాపి జీర్ణమని బొజ్జలు తడుముకొన గలవారు కూడ ఉన్నారు. మఱికొందఱ తీరు వేఱు. వీరిది వేవిళ్ళతీరు. ఇమిడ్చు కొనలేరు. అన్యాయమును దేనిని సహింపరు. అట్టిదానిని నిరోధించవలెనని ఆసింతురు, కాదు—ఆక్రోశింతురు. అట్టియెడ తమ అంతస్తు ఎట్టిదాయని కూడ వీరు చూచుకొనరు. అదియొక పొంగు! చిరంజీవి జగన్నాథం ఈ మూడవ కోవకు చెందును.

వరంగల్లు కళాశాలలో నా విద్యార్థి. ఆ దశలోనే అన్యాయాలంటే ఆతడు పడు చుండిన ఆవేదన గుర్తించితిని. అందీయందని సాధనాలతో ఆనాడే ఆలాపింప సాగినాడు అన్యాయపరులపై ఆక్రోశగీతాలు. ఈ చిచ్చుర్రీ ఊరుకోదని నేనప్పుడే యనుకొంటిని. వచ్చిన యుద్యోగమును వద్దని పట్టుదలతో చదివినెగ్గినాడు తెలుగు ఎం.ఏ. పరీక్షలో. పెద్ద చదువులు చదువుచున్నను లోపలి మంటల రవ్వలు లేచుచునే యున్నవి కాబోలు! అక్షరాల రూపు కట్టుకొని అంబరానికెగిసినవి. అవి ఈ ఖండిక యయినవి.

ముప్పది శీర్షికలు. భావవైవిధ్యముతో రచనయు పరుగిడ జూచినది కాని కాళ్ళ సత్తువయో! భావము గెలిచినది. మహోదయం- స్వాతంత్ర్యగీతి- తన్మయత్వం- ప్రభా తాంజలి- పతాకారోహణము వంటివి జాతీయ భావ ప్రచురాలు. బహురూపుల వేషాలు- ప్లేటుఫిరాయింపు- అపశ్రుతులు మొదలైనవి స్వార్థపరుల కౌటిల్యమునకు లఘు టీకలు. 'మేల్కొన్న శవాలు' అనునది అనాధ సముద్ధరణలో ఆసించిన అమర రాజ్యమును చూపునది. దిహాంధములస్వగతం- ప్రసవవేదన- వక్రభాష్యం-లలో సున్నితమైన హాస్యము డెందమును పెదవులను కూడ విరియింప కలుగచున్నది. జాతికోసం- శాంతి కోసం-భక్తి కోసం- ముక్తి కోసం- ఆహుతినై పోదునన్న యీ పిన్నవాని ఆశయము ఉదాత్తము కాదా? ఈ చిరంజీవి 'మనోరథాలు' సర్వసజ్జన మనోరథాలు. ఏ రచయిత యైనను ఆసింప దగినవవియే. మాతృభాష మరాఠి యైనను తెలుగులో ఎం.ఏ. పట్టమును పొంది చక్కని భావాలతో ఇట్టి రచనలు సాగించు నేర్పుగడించుకొనిన పేర్వారం జగన్నాథము నభినందింతును చిరాయురభ్యున్నతుల నొంద నాశీర్వదింతును.

హైదరాబాదు
6-8-1960

'శిరోమణి' చెలమచర్ల రంగాచార్యులు
ఆంధ్రోపన్యాసకులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభిప్రాయం

మిత్రులు జగన్నాథంగారి కావ్యం ఆయన తొలి ప్రయత్నమను కుంటాను. అభిప్రాయం రాయడం నాకూ ఇదే ప్రథమం. ఒక దశాబ్దం క్రితం వచ్చిన యువ కవుల తొలి కావ్యాలతో పోల్చిచూస్తే. జగన్నాథంగారి రచన చాల మెరుగ్గావుందని చెప్పవచ్చు. దీనికి కారణం యిటీవలి కాలంలో గేయ, వచనగేయ కవితా మార్గాలలో కలిగిన క్రమపరిణామ వికాసం. దీని ప్రభావం వర్తమాన యువకవులందరిమీదా వుంది.

అత్యున్నతమైన ఊహా శిఖరాగ్రాల కెక్కబోయి, భావ ప్రకటనా సామర్థ్యం లేక కాల్జారి పడటంకంటె.—లేదా భావశూన్యతను కప్పి పుచ్చటానికి శబ్దాడంబరపు ముసుగులు వేసుకొని మోసగించడం కంటె, ఏనాటికైనా కవితలో యీ రెంటి సమన్వయమే ఉత్తమమైన మార్గం. ఈ సమన్వయం యీ కావ్యంలో చక్కగా కుదిరింది.

"వీడి మొఖం ఎన్నడైనా చూశాడూ నీకటిని?" అని గుడ్లగూబలు సూర్యుణ్ణి ఉద్దేశించి వెక్కిరింపుగా అనడం రమ్యంగానూ, వ్యంగ్యంగానూ వుంది. "మోసం కోర మీసాలు పెంచి దబాయిస్తున్నది పరిసరాలను" వంటి పంక్తులు బాగా చేయి తిరిగినవాడు వ్రాసినట్లున్నాయి.

ఈ కవి యితోధికంగా కావ్యరచనచేసి, ఆధునిక కవితా మార్గాల సువ్యవస్థీకరణ కృషిలో తోడ్పడతాడని ఆశిస్తాను.

హైదరాబాదు
7–8–1960

కుందుర్తి ఆంజనేయులు
ఆంధ్రప్రదేశ్
ప్రభుత్వ సమాచారశాఖ

# పీ ఠి క

యువకవి పేర్వారం జగన్నాథం నాకు చాలాకాలంనుంచి సుపరిచి
ఇటీవలే ఈయన తెలుగులో ఎం. ఏ. పట్టం గడించుకున్నాడు. విద్యార్థిద
తెలుగు సారస్వత సమితులు నడిపి భాషాభిమానాన్ని ప్రకటించాడు. అప్పుడ
గుండె లోతుల్లోనుంచి వెలికి చిమ్ముకొని వచ్చిన శ్రుతుల్ని సంపుటీక
'సాగరసంగీతం'గా వినిపిస్తున్నాడు.

ఈతడు పుట్టిన ఊరు జనగామ తాలూకాలోని ఖిలాషాపురం. సరా
పాపని సమర హుంకృతులతో పులకలు వెలార్చిన పునీత స్థలమిది. ఆ
గడ్డలో పుట్టిన పుణ్యం ఈతని కుండనే ఉన్నది. పైగా కవితాకళ చిన్న
పట్టుబడడంవల్ల మరీ ధన్యుడైనాడు.

తెలంగాణం నడిగడ్డలో పుట్టినా ఈతని ఇంట్లో మాట్లాడుకునేది తె
కాదు. పాలకురికి సోమన్న వృషాధిప శతకంలో పేర్కొన్న ఆరెబాస- ఇ
మరాఠీ ఈతని మాతృభాష. ఇంటిలో ఏది మాట్లాడినా, ఈయన ఒంటిలో మా
తెలుగు పలుకు పరవళ్లు తొక్కింది. అదే క్రమంగా 'సాగర సంగీతం'గా
మించింది.

ఈనాటి యువకవుల్లో ఒక ప్రత్యేకత కనిపిస్తున్నది. అదేమిట
వస్తువులో, ఛందస్సులో, కావలసినంత వైవిధ్య ముండడం. ఏదో ఒక శా
పట్టుక వ్రేలాడేవాళ్లూ, 'తాబట్టిన కుందేటి' మనస్తత్వం కలవాళ్లూ, ఈనాడు స
సంఖ్యలో ఉన్నారు. నిజానికి ఉదీయమాన దశలో ఉన్న కవులకు వైవిధ
ప్రాణం. మొనదీరిన ఘనయోధులు ఏదో ఒక మార్గంలో స్థిరపడి పో
మంచిదే. కాని పిల్ల వస్తాదులు అమ్ముా, ఈటె, ఖడ్గం, పరశువూ-అన్నీ ప్ర
గించడం నేర్చుకోవాలి. జగన్నాథం కవితా సంపుటిలో ఈ వైవిధ్యం స్పష్ట
కనిపిస్తున్నది.

పయోదాన్ని చూసినా, పదిహేనగస్టు పతాకాన్ని చూసినా, ఈం
సమంగా స్పందించిపోతాడు. సొంతయింట్లో 'ప్లేటుఫిరాయింపు' గాళ్ళను

వాడిగా హెచ్చరించాడో, పొదుగింట్లో నరక సదృశంగా వున్న సింగ్మనేరిని అంత నిశితంగానే మందలించాడు.

ముఖ్యంగా ఆశాగీతాల్లోనూ, అధిక్షేప గేయాల్లోనూ, ఈయన విశిష్టత చూపించాడు. ఈ సంపుటిలోని 'వక్రిభాష్యం', 'మహావిష్ణువు మరణం' అన్నవి ఈనాటి సమాజం కీళ్ళను మెత్తగా పొడిచే రచనలు. ఇక 'ప్రసవవేదన' అన్న గేయంలో అణువు ప్రసవించడం అన్న ఊహ చాలా గొప్పది. ఈ గేయంలో నవ్యత్వం గుబాళిస్తున్నది. అణుగర్భంలో ఉన్న శిశువు 'నరవానన భరించలేను' అని అరవడం ధ్వనిమయంగా వుంది. ఈ గేయం ముగిసే దాకా అణువు ప్రసవించదు. 'పుట్టబోయే పసిగుడ్డు ఎవరిపోలె ఉంటుందో' అన్న మాటతో ఇది ముగుస్తుంది. భవిష్యత్తులో అణు ప్రసవంమూలాన జరిగే ఉపప్లవం ఈ సందేహంలో ధ్వనిస్తుంది. ఛందోరీతిని బట్టిచూస్తే ఇది వచన గేయం.

ఈయన మిగతా వచన గేయాలు కూడా ఎక్కడా కుంటు వడకుండా, సరళంగా నడుస్తాయి. అయితే మాత్రాచ్ఛందస్సులో వ్రాసిన గేయాలే కొంచెం లేతగా వున్నాయి. ఇంతకూ వాటి వయసెంత మరి ? క్రమంగా ముదురు పాకంలో పడుతాయనే ధైర్యం నాకుంది.

'మండి పోయెడు ఎదల లోపల - బొండు మల్లెలు విరియ బూసెను' వంటి కవితా గంధి వాక్యాలు ఈ సంపుటిలో చాలావున్నాయి.

శ్రీ శ్రీ ప్రభావమూ, ఆయన తర్వాత ప్రసిద్ధులైన నవ్యకవుల ప్రభావమూ, ఈయనమీద స్ఫుటంగా కనిపిస్తున్నది. అయితే అనుకరణ గుణం లేక పోవడం ఆరోగ్య లక్షణం. పైగా ఏది చెప్పినా అందంగా వుండేట్టు, అందరికీ అందేట్టు చెప్పడం ఈ కవిలో వున్న విశేషగుణం. అస్పష్టత, క్లిష్టత అనేది ఈ సంపుటిలో లేక పోవటం విశేషం. ఈ సంపుటిని పరిశీలిస్తే జగన్నాథం అనతి కాలంలోనే ఆధునిక సాహిత్యంలో సముచిత స్థానం సంపాదించుకుంటాడని నా కనిపిస్తున్నది.

హైదరాబాదు
8-8-1960

సి. నారాయణ రెడ్డి
ఆంధ్రోపన్యాసకులు
ఉస్మానియా విశ్వ విద్యాలయం

# కృతజ్ఞతలు

అప్పుడప్పుడు నేను పత్రికలలో ప్రచురించిన గేయాలను ఇందు
సంకలితం చేశాను. ఈ కావ్యాన్ని ప్రచురించమని నన్ను ప్రోత్సహించి ఆర్థ
సహాయం చేసిన నా ఆబాల్య మిత్రుడు శ్రీ చింతకుంట్ల వెంకటరామారెడ్డి
(కొత్తపల్లి, జనగామ తాలూక) నా హార్దిక కృతజ్ఞతలు. గ్రంథానికి పీఠిక రా
ఆంధ్ర సాహితీ ప్రపంచానికి పరిచయంచేసిన శ్రీ సి. నారాయణరెడ్డిగారికి నమ
వాకాలు. గురువులైన శ్రీయుతులు ఖండవల్లి లక్ష్మీరంజనం, డా॥ దివాకర్ల వేం
టావధాని, డా॥ బి. రామరాజు, శిరోమణి చెలమచర్ల రంగాచార్యులు గారల
భక్త్యంజలులు.

సుహృదయంతో అభిప్రాయాన్ని రాసిన శ్రీ కుందుర్తి ఆంజనేయు
గారికి నమస్సులు.

ఈ గేయాలను తొలుత ప్రచురించిన 'సంజయ', 'స్వతంత్ర', 'స్రవంతి
'గోలకొండ పత్రిక', 'తెలుగుదేశం' మున్నగు పత్రికా సంపాదకులకు కృతజ్ఞతల
ఈ గ్రంథ ప్రచురణలో ఆదినుండి చివరిదాకా సహకరించిన మి త్రు డ
శ్రీ జె. బాపురెడ్డికి ధన్యవాదాలు.

ఈ సంకలనాన్ని తమ కావ్యమాలలో చేర్చుకున్న 'నవ్యసాహితీ సమితి
వారికి అభివందనలు.

హైదరాబాదు
**23-8-1960**

పేర్వారం జగన్నాథం

# పత్రికలేమన్నాయి

"సంజయ" ది. 22-9-1960 :-

ఆంధ్ర దేశంలో అనుదినము అనేక అభ్యుదయ కవులు ఆవిర్భవిస్తున్నారు. కావ్యకుసుమాలను సృష్టిస్తున్నారు. వాటిని సంకలించిన పుస్తక మాలలతో సరస్వతీదేవి నారాధిస్తున్నారు.

సాహిత్యం అత్యంత వేగంతో ముందంజ వేయటం ముదావహం. కొంగ్రొత్త రచయితలు సాహితీ పొలిమేరలలో ప్రవేశించటం హర్షనీయం. పలువురు, వినూత్న రీతులలో, అభ్యుదయ ధోరణిలో వ్యాసంగం చేస్తున్నారు. వారి రచనలు కొన్ని గంభీరోదాత్తములైన భావాలతో నిండినవి.

ఉత్తమ మార్గాలలో ఉన్నత ప్రమాణాలను నెలకొల్పుతూ, దేశం కోసం, సమాజం కోసం రచనలు సాగించే వారు నేడు అరుదు. కేవలం రచన కోసం రచనచేస్తూ. పత్రికలలో, పుస్తకాలలో, పేరు పడ్డ మాత్రాన అత్యున్నత శిఖరాగ్రంపై కూర్చున్నట్లు భావించే వారు కొల్లలుగా వున్నారు.

జాతి సమైక్య దృష్టితో, ఉత్కృష్ట ఆశయ సాధన కోసం రచనలు సాగించే వారెక్కువగా కానరావటం లేదు. ఉన్నత ప్రమాణాలవైపు దృష్టి పోవటం లేదు.

ప్రధానంగా — ఖండ కావ్యాలు—విపరీత ధోరణిలో, సృష్టించ బడుతున్నాయి. తలా—తోక లేకుండా, తోచిన రీతిలో ఖండ కావ్యాలు రాయటం, వాటికి "అభ్యుదయ కవిత్వం" అంటూ నామకరణం చేయటం సాహితీ సీమలో ప్రబలుతున్న ఒక అనారోగ్య లక్షణం. అభ్యుదయ కవిత్వం అనవరతము ఆహ్వానింపదగినదే. కానీ అభ్యుదయ కవిత్వానికి కూడా కొన్ని నిర్ణీత ప్రాథమిక సూత్రాలు అమలు జరపటం అత్యంత ప్రధానం. విస్తృతంగా వస్తూన్న ప్రస్తుత ఖండ కావ్యాలను పరిశీలిస్తుంటే విచారమేస్తుంది సాహిత్యం ఎంతగా దిగజారి పోతున్నదో ద్యోతక మౌతుంది.

శ్రీ పేర్వారం జగన్నాధం రచించిన "సాగర సంగీతం" అభ్యుదయ కవిత్వానికి సరికొత్త చేరిక. ఈ సంపుటిలో ముప్పై ఖండ కావ్యములున్నవి. ఇందులోని గేయాలు కొన్ని "సంజయ"లో ప్రచురితమైనవే. మరికొన్ని వేర్వేరు పత్రికలలో వచ్చినవే.

ఈ రచనల్లో ఒక పొంగు గోచరిస్తున్నది. యువకత్వం కానవస్తున్నది. విభిన్న వస్తువులను తీసికొని సరికొత్త రీతిలో, పాఠకుల హృదయాలను హత్తుకునేటట్టు ఆకర్ష

ణీయంగా వ్రాసారు. కొన్ని గేయాలు దేశభక్తిని ప్రకటిస్తాయి. ఇంకొన్ని సమాజాన్ని మెత్తగా విమర్శిస్తాయి. మరికొన్ని గేయాలలో కవి ఆశయాలు, అనుభూతులు, సందేహాలు, వ్యక్తం చేస్తాయి. వారి సందేహాలను నివృత్తి చేయటం సామాన్య విషయం కాదు మానవమేధస్సును తికమక పెట్టే ప్రశ్నలు వేస్తారు. "రాతియుగంనుండి. నేటి దాకా. నడిపించిన మానవ మేధా యంత్రం నుండి ఏలా ఉద్భవించే–మానవ మారణ హోమ సమిధలుగా అణ్వస్త్రపుటాయుధాలు"

ఈ సంకలనంలోని కొన్ని విశిష్టమైన గేయాలివి. ఆహుతి–వక్రభాష్యం–ప్రసవ వేదన–ఎవడికెరుక–సాగర సంగీతం – మహావిష్ణువు మరణం – తిరోగమనం – నగ్న దృశ్యాలు–గావుకేక–నివేదన మున్నగునవి.

"ఆహుతి" గేయంలో జాతికోసం, ఖ్యాతికోసం, శాంతికోసం! ప్రగతి కోసం, భక్తి కోసం ఆహుతినై పోదును అంటూ దేశ భక్తిని ప్రదర్శించాడు.

సమాజాన్ని వ్యంగ్యంగా విమర్శిస్తారు వక్ర భాష్యంలో—

అణువు ప్రసవ వేదనను హృదయాలను కదిలించే రీతిలో ఉత్కృష్టంగా రచించారు "ప్రసవ వేదన" వచన గేయంలో. ఊహకతీతమైన. సమాధానం దొరకని, క్లిష్ట సమస్యలని, మానవ మేధస్సుని "ఎవడి కెరుక"లో ప్రశ్నిస్తారు.

నాగార్జున సాగర సందర్శనంతో కవి హృదయం స్పందించి, పరవళ్ళు త్రొక్కుతుంది. వీడరాని అనుబంధం ఏర్పడుతుంది.

"పాతరాళ్ళను వీడి, జాతి సంపదబాసి, కదలలేకున్నాను, వదలిరాకున్నాను. శిలలలో నేనొక్క శిలనయ్యి పోయాను" అంటూ విచారాన్ని వెలిబుస్తాడు వీడ్కోలు తీసుకుంటూ.

ఉదాత్త భావాన్ని మనోహరంగా "మహావిష్ణువు మరణం"లో హాస్యాన్ని చిందిస్తూ చిత్రించారు. "మోసం కోరమీసాలు పెంచి దబాయిస్తున్నది పరిసరాలను" అన్న వాక్యం అనుభవజ్ఞులు వ్రాసినట్లుంది.

తిరోగమనంలో మానవమేధస్సు నుండి ఉత్పన్నమౌతున్న విచిత్ర పరిణామాలను వివరిస్తూ, ప్రపంచం ముందంజ వేస్తున్న కొద్దీ మానవమేధస్సు తిరోగమనాన్ని ఆకాంక్షిస్తుందంటూ విచారాన్ని వెలిబుచ్చుతాడు. "కొండగుహల చీకట్లో, ఉండిపోదమంటున్నది"

విజ్ఞాన వంతుల మెదడుకు మేతను "నగ్న దృశ్యాలు"లో కల్పిస్తాడు

"ఔన్నత్యమును జూచి హర్షించలేరు మరి నాదీనతను చూచి నవ్వుకొందురుగాని" అంటూ "గావుకేక"లో అంటారు. ఈ వాక్యం పాఠకులని బాగా ఆకర్షిస్తుంది.

"నివేదనలో" అనిర్వచనీయమైన ఆవేదనను నివేదిస్తాడు కవి. "నిరాశా నిస్పృహలు నాలో కళ్ళెం విడిచిన తురంగంలా కడలిలోని తరంగంలా అంతులేని వేగంతో గంతులు వేస్తున్నాయి"

ఇంకా ఇతర గేయాలు దేశభక్తి ప్రపూరితములు, జాతీయ భావ ప్రచురణలు గేయ సంకలనంలోని కొన్ని గేయాలు బలహీనంగా, పేలవంగా వుండడం రచయిత చిన్న వయస్సే ప్రధానంగా వ్యక్తమౌతుంది.

అభ్యుదయ కవుల ప్రభావము, ముఖ్యంగా శ్రీ శ్రీ ది శ్రీ పేర్వారం జగన్నాథంపై బాగా పని చేసినట్లున్నది. "ఆయితే అనుకరణ గుణం లేక పోవడం ఆరోగ్య లక్షణం" అన్నారు. శ్రీ సి. నారాయణ రెడ్డి గారు తమ పీఠికలో.

నా దృష్టిలో అనుకరణ పూర్తిగా లేదనటం రచయితకు అన్యాయం చేసిన వాళ్ళం అవుతాం. అనుకరణవుంది, కానీ ఒక మోతాదులో వుంది. దానివల్ల పెద్ద ప్రమాదమేమీలేదు. రచయిత సారస్వత లోకానికి కొత్త కనుక అనుకరణ వుండటం సహజం. శ్రీ నారాయణ రెడ్డిగారు వ్రాసినట్లూ కవిగారి గేయాలలో క్లిష్టత, అస్పష్టత మాత్రంలేదు. ఇదే సంకలనానికి గొప్పధనం.

"ఒక దశాబ్దంక్రితం వచ్చిన యువకవుల తొలి కావ్యాలతో పోల్చి చూస్తే జగన్నాథంగారి రచన చాలా మెరుగ్గా వుందని చెప్పవచ్చు" అంటూ శ్రీ కుందుర్తి ఆంజనేయులు తమ అభిప్రాయాన్ని వ్రాసారు. ఇది అక్షరాలా వాస్తవమేనని అనిశయోక్తి కాదని అనిపిస్తుంది.

ప్రముఖ పండితులు డాక్టరు దివాకర్ల వెంకటావధాని. శిరోమణీ శ్రీ చెలమచెర్ల రంగా చార్యులు, శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారలు రచయితని ఆశీర్వదించారు.

రచయిత అనతికాలంలోనే ఆధునిక సాహిత్యంలో సముచిత స్థానం సంపాదించుకొంటారనుటలో ఈషణ్మాత్రం శంకలేదు. వారి రచనల్లో గంభీరత, ఉదాత్తత ఎక్కువపాళ్ళలో వుంది శైలి బాగుంది' సమాజంలో ఆవిర్భవిస్తున్న అత్యంత ప్రధానమైన క్లిష్ట సమస్యలని' అందరికి అర్థమయ్యే భాషలో విరచిస్తే, సారస్వతమతల్లికి సరియైన సేవచేసిన వారౌతారు.

—శ్రీ బాసాని సుదర్శనరెడ్డి

"గోలకొండ పత్రిక" ది. 5-4-1961 :-

గేయసంపుటి వెల రు. 1 రచయిత పేర్వారం జగన్నాథం. నవ్యసాహితీ సమితి హైద్రాబాద్ వారి ప్రచురణ ఇది.

నవ్యసాహితీ సమితి అనుబంధ ప్రచురణ అయిన "సాగర సంగీతం"లో ముప్పది ఖండికలున్నాయి. కవిత్వం అనేది అందులో గేయకవిత్వం ఉద్వేగప్రధానంగా ఉంటుంది. జీవితంలో పొందే అనుభూతులు అనుభవాల పెనవేసుకొని వస్తుంది. ఈ ఖండికలన్ని విషయ వైవిధ్యంతో వివిధరీతుల్లో కొనసాగినవి. బహురూపుల వేషాలు, ఆషాఢ పయోదం, మహావిష్ణువు మరణం, దివాంధముల స్వాగతం లాంటివి ఉదాత్త భావాలతో ధారాశుద్ధిని కలిగి ఉన్నాయి. వీరి కవిత్వం మచ్చుతునక. ఇది ప్రస్తుత ప్రపంచ సంక్షుభిత స్థితిని ఎంత చక్కగా చిత్రించారో:

మానవ మేధస్సునుండి హాలాహలం పొంగుతున్నది.

మానవ మేధస్సులోన కోలాహలం జరుగుతున్నది
మానవ మానస క్షేత్రం సంగ్రామ కురుక్షేత్రం
మానవ మానస క్షేత్రం నిటలాక్షు తృతీయ నేత్రం
మానవ మస్తిష్కంలో అణువులు ప్రసవిస్తున్నాయి.
అణువణువున మహాశక్తి అవతారం పొందుతున్నది
మానవ మేధస్సు తోలు కప్పుకుంటనంటున్నది.
మానవ మేధస్సు వచ్చి నరమాంసం మెక్కుతున్నది.
సౌధోపరీ భాగాల్లో సంసారం వద్దంటున్నది.
కొండ గుహల చీకట్లో ఉండిపోద మంటున్నది.

"ఆంధ్రప్రదేశ్" మే 1961 :-

ఇది వివిధ భావపూరితములైన ముప్పది ఖండకావ్యముల సంపుటము. అందు సాగరసంగీతమను శీర్షికగల ఖండకావ్యమును బట్టి మొత్తము సంపుటమునకుఁగూడ ఆపేరే పెట్టఁబడినది. గ్రంథకర్త తొలిరచన ఇది. ఆయన హృదయమొక సాగరము. అందుండి వెలువడిన వివిధ సంగీత రీతు లిందలి ఖండకావ్యములు.

ఇందలి కావ్యములు వ్యావహారిక భాషలో వివిధమాత్రా ఛందములలో రచింపబడినవి. కొంచెమించుమించుగా నన్నియు నభ్యుదయమార్గముననే నడచినవి. భావములందు వైవిధ్యము కలదు. కొన్ని కావ్యములు దేశభక్తి ప్రేరితములు; కొన్ని హేళనాత్మకములు; కొన్ని జగత్ప్రవృత్తి ప్రదర్శకములు; కొన్ని ఆత్మాశ్రయములు.

ఆహుతిలో కవి ఆదర్శము చక్కగా విశదీకరింపబడినది, జాతికోసము, జనుల కోసము, శాంతిసమతల కోసము అతఁడెట్టి త్యాగమొనర్చుటకైన సంసిద్ధుఁడు. విశ్వ సందేశము వినిపించు కవీంద్రుని ప్రాతపాళియో, స్వాతంత్ర్య సమరమున సమసి పోయిన వీరునికై హర్షమున వీరమాత రాల్చు కన్నీటి బిందువో అయిపోదమని అతని కోరిక. అతఁడు కవిరాజైనచో విశ్వకీల వెలుఁగుటకై తన రుధిరమునంత పిండి తైలముగా ధారపోయుటకు వెనుదీయఁడు. హృదయము నావరించిన నిరాశా నిస్పృహలు మాడిపోవునట్లుగా నెడఁదలో నింత చిఱుదివ్వె వెలఁగింప వలెనని అతడు భగవంతునికిఁ జేయు విన్నపము.

కవి జాతీయభావమును, దేశభక్తిని బ్రదర్శించు కావ్యములలో మహోదయం, స్వాతంత్ర్యగీతి, సాగరసంగీతం, తన్మయత్వం, ప్రభాతాంజలి, పతాకారోహణం ముఖ్యములైనవి. స్వాతంత్ర్యము లభింపఁగానే దేశీయుల హృదయాలలోఁ గలిగిన యానంద చైతన్యము మహోదయములో వివిధరీతుల వెల్లడిచేయఁబడినది. "మండి పోయెడు ఎదలలోపల బొండుమల్లెలు విరియఁబూసె" ననుట యందలి యొక మనోజ్ఞమైన రీతి. ఆ సమయమునఁ గవి హృదయ మ్మృదుమధురవాహిని వఱదలై పాఱిపాఱి చివరికి మహాసముద్రముగ మాఱినది. నాగార్జున సాగరమును జూచి కవి పొందిన పారవశ్య మతని దొక్కనిదే కాదు: సర్వాంధ్ర జనులకును సంబంధించినది. నవ్యాంధ్ర రాష్ట్రమున ముక్కోటి ప్రజలొక్కవేదికపై నిల్చి భారతికి నీరాజనము లెత్తుట గాంచి యతని మేను పులకించినట్లే ఆంధ్రులందఱి మేనులును బులకించినవి. పైకావ్యములలోని భావములు విశ్వజనీనము లగుటచే హృద్యములుగా నున్నవి.

గ్రంధ కర్తకు మోసము, కపటము. మున్నగు దుర్గుణముల పైఁగల యేవగింపు బహురూపుల వేశాలు. ప్లేటు ఫిరాయింపు మున్నగు కావ్యములలో వెల్లడిచేయఁబడినది. ఇందలి హేళన మృదువయ్యు చాలశక్తిమంతముగా నున్నది. 'కాళ్లువిరిగిన వేటకుక్క'లో కాంగో వృత్తాంతము కన్నులకు కట్టినట్లు వర్ణింపఁబడినది. జనశక్తి సిగ్మ్రసీ కంఠకావర మడఁగించిన చిత్రమిందు చక్కగా నిరూపింపబడినది.

వక్ర భాష్యము, ప్రసవ వేదన, మహావిష్ణువుమరణం, మేల్కొన్నశవాలు, దివాంధముల స్వగతం. వీడ్కోలు సందేశం భావగంభీరములై జగత్తునందలి వికారము నట్టహాసముచేయుచు, కవికిఁగల శాస్త్రవిజ్ఞాన పరిచయమును వెల్లడిచేయుచున్నవి. అణువు ప్రసవవేదన అద్భుతముగా వర్ణింపఁబడినది. పుట్టఁబోయె పసిగుడ్డు ఎవరివోలె వుంటుందో అను ముగింపు ప్రపంచ భావిప్రవృత్తి విషయమునఁగల సందిగ్ధస్థితిని చక్కగా నిరూపించుచున్నది.

ఎవడికెరుక, భిన్నరాగాలు మున్నగు కావ్యాలలో నవ్యాంధ్ర మహాకవుల రచనల అనుకరణము గోచరించుచున్నది. "పీతాల పంపకపు బేరాలు కుదురక.... బాపూజికే మెరుక ప్రవిమలాత్మయె తప్ప" అను భావమునందలి యాదార్థ్యమందఱు నెఱింగినదే. ఈ కావ్యమునందలి యితరపద్యాలన్నియు నా భావమునే భిన్న పదములతో సూచించు చున్నవి.

ఇందలి కావ్యములన్నియు కుంటులేక ధారాళముగా నడచుచున్నవి. వాడఁబడిన పదాలు మృదుమధురములై భావప్రకటనమున శక్తివంతములుగా నున్నవి కొన్ని కావ్యములందలి యంతరార్ధము నిగూఢమై యుండుటకు భావకాఠిన్యమే కారణము కాని పదకాఠిన్యముకాదు. కవి భావనావిధానము ప్రౌఢమగుట కవకాశమున్నది. పాళినయ్యి పోదామని; కిసలయాలతో; సుమనోజ్వల; ఆషాఢమేతెంచ-వంటి ప్రయోగములు వ్యావహారిక భాషలోనైనను ఉండఁదగినవికావు. "కవ్వుకుంట నంటున్నది" తెలంగాణా వాడుకను సూచించుచున్నది. కవి మాతృభాష మరాఠీ. అతడు తెలుగు భాష నభ్యసించి, అందు పట్టభద్రుఁడై, ప్రసన్నమధురముగా కవిత సాగించుట ముదావహము. ఆయన తేలిక రచనలతో తృప్తిపడక ప్రౌఢతకు పాటుపడుట వాంఛనీయము.

# ఇదీ వరుస

| | | | |
|---|---|---|---|
| 1. | ఆహుతి | — | 22-10-1958 "గోలకొండ" పత్రికలో |
| 2. | ఎక్స్‌రే కథ | — | 17-9-1959 "సంజయ" వారపత్రిక |
| 3. | వక్రభాష్యం | — | 30-7-1959 "సంజయ" లోను<br>26-9-1959 "తెలుగు స్వతంత్ర" లోను |
| 4. | మనోరథాలు | — | 20-12-1957 "తెలుగుదేశం" వారపత్రిక |
| 5. | ప్రసవవేదన | — | ఉస్మానియా విశ్వవిద్యాలయం-తెలుగు<br>వార్షిక సంచిక "శోభ" (1958-59) లో |
| 6. | ఎవడికెరుక | — | ఉస్మానియా విశ్వవిద్యాలయం- తెలుగు<br>వార్షిక సంచిక "శోభ" (1959-60) లో |
| 7. | మహోదయం | — | అక్టోబరు 1958 "స్రవంతి" లో |
| 8. | స్వాతంత్ర్యగీతి | — | 15-8-1958 "గోలకొండ" పత్రిక లో |
| 9. | సాగర సంగీతం | — | 19-11-1959 "సంజయ" లో |
| 10. | బహురూపులవేషాలు | — | 10-9-1956 "తెలుగుజ్యోతి" (పక్ష<br>పత్రిక-జనగామ) "శ్రవణం" కలం పేరుతో |
| 11. | పేటు ఫిరాయింపు | — | 2-10-1956 "వెలుగు" (పక్షపత్రిక-<br>జనగామ) "శ్రవణం" కలం పేరుతో |
| 12. | అపశ్రుతులు | — | 1-4-1957 "తెలుగుదేశం" వారపత్రికలో |
| 13. | తన్మయత్వం | — | 1-11-1956 "తెలుగుదేశం" పత్రికలో |
| 14. | ఆత్మార్పణం | — | 15-8-1957 "తెలుగుదేశం" పత్రికలో |
| 15. | భిన్నరాగాలు | — | ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు వార్షిక<br>సంచిక "శోభ" (1957-58) లో |
| 16. | దగ్ధకంఠం | — | |
| 17. | ప్రభాతాంజలి | — | 3-1-1957 "తెలుగుదేశం" లో |

| | | |
|---|---|---|
| 18. | తిరోగమనం | — 28-7-1958 "గోలకొండ పత్రిక" లో |
| 19. | కాళ్ళువిరిగిన వేటకుక్క | — |
| 20. | ఆషాఢ పయోదం | — |
| 21. | పతాకారోహణం | — |
| 22. | మహావిష్ణువు మరణం | — |
| 23. | దినచర్య | — 24-3-1960 "సంజయ" వారపత్రిక లో |
| 24. | మేల్కొన్న శవాలు | — |
| 25. | వీడ్కోలు సందేశం | — |
| 26. | గావు కేక | — 22-11-1957 "తెలుగుదేశం" లో |
| 27. | నగ్న దృశ్యాలు | — |
| 28. | దివాంధముల స్వాగతం | — |
| 29. | వేదన | — |
| 30. | నివేదన | — 14-4-1960 "సంజయ" లో |
| 31. | ఆశాకిరణం | — 6-1-1955 "తెలుగు దేశం" వార పత్రిక లోను "తొలికారు" (కవితా సంకలనం—సాహితీ బంధు బృందం ప్రచురణ-1955) లోను |
| 32. | వర్షబిందువు | — "తొలికారు" (కవితా సంకలనం-సాహితీ బంధు బృందం ప్రచురణ—1955) లో |
| 33. | ప్రతిజ్ఞ | — 9-6-1960 "సంజయ" లో |
| 34. | ఏడుకొండలాయెంకన్నా | — 1-1-1956 "వెలుగు" (పక్ష పత్రిక-జనగామ) లో |
| 35. | అగ్రరాజ్య చతుష్టయం | — 12-5-1960 "సంజయ" లో |
| 36. | కన్నీటి కథ | — |



ఆధునిక కవితా ప్రస్థానంలో
ఒక వైశిష్ట్యాన్ని సంతరించుకున్న కవి

**పేర్వారం జగన్నాథం**



సాహితీ బంధుత్వ అచ్చమైన
ఆత్మీయతకు ప్రతీక

**చింతకుంట్ల
వెంకటరామారెడ్డి**

# ఆహుతి

జాతి కోసం
జనుల కోసం
కాగడానై
కాలి పోదును

నీతికోసం
నిజం కోసం
అగ్ని కీలల
నారగింతును

శాంతి కోసం
సమత కోసం
ఎదల లోపలి
గదుల గూల్తును

ప్రగతి కోసం
జగతి కోసం
పావు కోళ్లగ
బ్రతుక నేర్తును

భక్తి కోసం
ముక్తి కోసం
కప్పురమునై
కరగి పోదును

# ఎక్స్ రేకళ్లు

లోకాల పోకడల
లోతులను కన్నాను
లోతు లోతులు వెదికి
పాతరలు త్రివ్వాను
పాతరలు త్రివ్వాను

మూగ గొంతులు చేయు
సైగలకు అర్థాలు
పరికించి వివరీత
భాషలను నేర్చాను
భాషలను నేర్చాను

వెలుగు నీడల మధ్య
కల తారతమ్యాల
రాసులుగ విడదీసి
త్రాసుతో తూచాను
త్రాసుతో తూచాను

మానవాంతర మనో
వల్మీకములలోన
విష నాగు లాడు కొను
గుస గుసలు విన్నాను
గుస గుసలు విన్నాను

# వక్రభాష్యం

దైత్యారికి పట్టపగలు
దయ్యమొకటి పట్టినదట
మంత్రిగాళ్ల ముర వైరికి
యంత్రాలను కడుతూండ్రట

ఈశానుడు తిరిపెమెత్త
ఇల్లిల్లూ దిరిగిననూ
పాసిపోయిన అన్నమైనను
పరమ శివునికి దొరకలేదట

వాణీపతి కలం బట్టి
వ్రాద్దామనుకొనే సరికి
పాళి కాస్త విరిగిపోయి
ఫాలం జారిపోయిందట

"జన భారం మోయలేక
జగద్వలయం కృంగుతున్నది
మరో పంది అవతారం
మహావిష్ణు వెత్తాలని"
కొక్కొరొకో కోకోయని
కోడి ఒకటి కూసిందట

# మనోరథాలు

దేవతా శిఖరాగ్రమ్ముల
దీప్తితోడ వెలుగొందియు
మాసిపోయి మరుగున పడు
మల్లియనై పోవాలని
కోర్కె ఒకటి కలదు నాకు

విశ్వానికి సందేశం
వినిపించిన కవివర్యుని
పాతపడగ అరిగినట్టి
పాళినయ్యి పోదామని
కోర్కె ఒకటి కలదు నాకు

స్వాతంత్ర్యపు సమరంలో
సమసినట్టి వీరునికై
ఆనందపు బాష్పాలను
హర్షముతో రాల్చునట్టి
వీరమాత కన్నీరుల
బిందువునై రాలాలని
కోర్కె ఒకటి కలదు నాకు

# ప్రసవవేదన

అణువు ప్రసవిస్తున్నదట
వస్తారా చూసొద్దాం!
గర్భంలోనున్న శిశువె
గడియారం గంట కొట్టకముందే
"నరవానన భరించలేను
నరవానన సహించలేను"
అని అరిచిందట

నిండు చూలాలు అణువుకు
పొద్దులు నిండాయట
ప్రసవవేదన భరించలేక
ఆయాసం పడుతున్నదట

మంత్రసానులు గుసగుసలు బెడుతూ
అణుగర్భం పగులదీసి
పసిగుడ్డును తీయాలని
ప్రసవగృహంలో
ప్రయత్నం సాగించేందుకు
హడావిడిగా తిరుగుతున్నారట

నాటువైద్యులు గాభరాపడుతు వచ్చి
చేయిబట్టి చూస్తుంటే
నాడిదొరకడం లేదట

లేట్‌గా వచ్చిన లేడీడాక్టర్లు
ఆపరేషన్ చేయంది
అణువు బ్రతుకదని
హోప్‌లెస్‌గా పెదవులు విరిచారట

జ్యోతిష్కులప్పుడే
కలం కాగితాలు బట్టి
లెక్కలు కడుతున్నారట
పుట్టబోయే ఘడియ సరిగా
మూలానక్షత్రి మగునట

'శాంతి' పేర సంతర్పణ
జరుపాలని చెప్పారట
మూలకున్న ముసలి వైదికులు
పిలుపు కొరకు చూస్తున్నారట

బాలెంతరోగం నయమై
అణువు బ్రతికి బట్టకడుతుందో!
పుట్టబోయే శిశువుకు
ఏం పేరు పెడుతారో
ఇంతకూ
పుట్టబోయే పసిగుడ్డు
ఎవరివోలె ఉంటుందో!

# ఎవడికెరుక

అత్యున్నత హిమగిరి శిఖరాగ్రింపై
నివసించే ఫాలాక్షుని
పటు కుటిల భ్రుకుటి ఘటిత నిటలాక్షం నుండి
ఏలాపుట్టెను——
భీకర జ్వాలా మాలా కీలలు

శరచ్చంద్రి చంద్రికాధవళ కిరణ
రుచుల మించు
పయః పయోరాశి గర్భంలో
ఏలా జనియించెను——
సర్వలోక భస్మంకర కాలకూటము

అఖిలలోక సమ్మోహన
జలధారా పాతంచే
బీడుబడ్డ భూదేవిని
సుందర నందన వన సమమొనరించే

ఘన ఘనా ఘోర గంభీర
ఘేళ ఘేళార్భటులలో
ఏలా సంభవించె——
ప్రళయకాల దావానల సన్నిభ
ఆభీలాగ్నిగోళ సంఘమ్ములు

రాతియుగం నుండి నేటి
రాకెట్ దాక నడిపించిన
మానవ మేధాయంత్రం నుండి
ఏలా ఉద్భవించె—
మానవ మారణ హోమ సమిధలుగా
అణ్వస్త్రపు టాయుధాలు

# మహోదయం

మహోదయం మహోదయం
మహాజనులకిది శుభోదయం
స్వతంత్రజాతికి నవోదయం
స్వరాజ్యలక్ష్మికి యుగోదయం

మోడువారిన తరులశాఖలు
మోసులెత్తెను కిసలయాలతొ
ఎండిపోయిన బీడులం బడి
నిండు నదములు పొంగిపొరలెను

బండబారిన కరకు గుండెల
పాలవెల్లులు పొంగులెత్తెను
అగ్నికీలల తీక్ష్ణరేఖల
అంచులందున అమృతమొలికెను

పంజరమ్మున నున్న చిలుకకు
పసిడి రెక్కలు మొలిచివచ్చెను
తిమిరమయమగు పథములందున
తేజరిల్లెను దీపకాంతులు

మండిపోయెడు ఎదల లోపల
బొండుమల్లెలు విరియబూసెను
సుప్తజన హృదయాంతరమ్ముల
సుస్వరాలతొ వీణ మోగెను

మూడు రంగుల ధ్వజము నింగిని
ముట్టునట్లుగ పైకి లేచెను
ప్రజల జీవన రంగమందున
విజయనర్తకి నాట్య మాడగ
ఘల్లు మనియెను కాలియందెలు
ఝల్లు మనియెను కష్టుల గుండెలు

మహోదయం మహోదయం
మహాజనులకిది శుభోదయం

# స్వాతంత్ర్యగీతి

స్వాతంత్ర్య దిన మహా
స్వర్ణోదయమ్మందు
నా హృదయ మృదు మధుర
నవనీత వాహిని
వరదలై సాగింది
వాగులై పారింది
ఒడుదొడుకు లేకముగ
ఉప్పొంగి పోయింది

పంట చేలను జూచి
పరవళ్ళు త్రొక్కింది
కర్షకావళి గాంచి
కలకలా నవ్వింది
జలజలా రావముతో
జగమంత నిండింది
మిన్ను మన్నేకముగ
మిడిసిపడి ఎగిసింది

కోటి కిన్నెరలట్లు
మీటింది తన గళము
మూగ గొంతుల తోటి
ముచ్చట్లు పెట్టింది
శిథిల దేహములందు
జీవమ్ము నింపింది

అన్నార్తులను బిలిచి
కన్నీరు తుడిచింది
కరకుబండల పైన
కాల్జూని నడిచింది

నందికేశుడు తోక
ఆడించి నట్లుగా
కైలాస శిఖరాన
ఖండ పరశువు గాంచి
కొండ రాచూలి తల
కొప్పు జారిన యట్లు
స్వర్లోక గంగవలె
సాగింది సాగింది
సాగుతూ సాగుతూ
సంద్రముగ మారింది

# సాగర సంగీతం

నాగార్జున సాగరమిది
నాగార్జున సాగరమిది
ఆంధ్రదేశ సంపదలకు
ఆలవాలమైన చోటు
ప్రతి ఇంటను రాసులతో
బంగారం పంచిపెట్టు
రైతన్నలు గరిసెలలో
రతనాలే నింపుచుండ్రి
పల్లెటూరి జనం హర్ష
బాష్పాలను రాల్చుచుండ్రి

ఈ కొండ చరియలో
ఈ గండు శిలలలో
గలగలా రావాల
అలల ముంచెత్తేటి
కృష్ణమ్మ నడకలో
కృష్ణమ్మ రూపులో
నాగార్జునుని శాస్త్ర
నాదాలు వినిపించు
నాగార్జునుని బోధ
నామృతము రుచియించు

ఏనాటిదీ కొండ
ఏనాటిదీ కృష్ణ

తెగని బాంధవ్యాలు
విడని చుట్టరికాలు
శాతవాహన ఆంధ్ర
చక్రవర్తులు గూడ
ఇక్ష్వాకు వంశాది
క్షితిపాలు రెందరో
కాలవాహిని లోన
కరిగి పోయిన యట్టు
కఠినశిలలే కరిగి
కదలి పోవుచునుండె

ఇచ్చోటనే బౌద్ధ
భిక్షువుల స్థూపాలు
ఇచ్చోటనే వికృత
శిథిల శాసనమ్ములు
తొలగిపోయిన వైభ
వోన్నతుల జూపించు
మరచిపోయిన లోతు
చరితలను వ్రాయించు

బుద్ధదేవుని పాద
పూజ సల్పిననాటి
సంఘారామమ్ములు
సాగరమై పోవును
పాత రాళ్ళను వీడి
జాతి సంపద బాసి
కదలలే కున్నాను
వదలి రాకున్నాను

శిలలలో నేనొక్క-
శిలనయ్యి పోయాను

నాగార్జునసాగర మిది
నాగార్జునసాగర మిది

# బహురూపుల వేషాలు

బహురూపుల వేషాలకు
బాగుపడగ లేవురా
స్వ స్వరూపమేదో చూపి
సరదారువు కావలెరా

పది ఏండ్లకు ముందు నీవు
పగటి దొంగవై ఉంటివి
ప్రజల ఎముకలు పేర్చి
మేడలను లేపితివి
కక్షగట్టి జాతీయుల
కాల్చివేసి మసి యొనర్చు
రాక్షస మూకలకపుడ
ధ్యక్షుడవై నిలచినావు

రోజులు మారీ రాజుల
'పోజీషను' మారిననూ
పైశాచిక విలయ నాట్య
భంగిమలను మాన వీవు
'లాలూచి'ని వీడలేక
'లాల్చి' ఒకటి బిచ్చమెత్తి
అచ్చమైన ఖద్దరుతో
వచ్చినావు మోసగింప

# ప్లేటు ఫిరాయింపు

నీకు సీటెట్ల వస్తుందో చూస్తానుగా
అసలు ఓటెవరు వేస్తారో కంటానుగా

ఒకనాడు మా రుధిర నాళముల పెకలించి
మెకమువలె పీల్చావు పిప్పిగా చేశావు

క్రూరమగు రక్కసుల కండగా నిలిచియు
ఘోరమారణహోమ మొనరించితివి నాడు

గుండెలే తడియారి గుడ్లు తేలేసితే
మెండుగా మాపైన నిప్పులను జల్లావు

ఆలుబిడ్డలు జావ బేలలైపోతేను
జాలిలేకాయింత దీనులను గాల్చావు

నేటి వ్యవహారాల్లో బేరాలు కుదురక
ప్లేటుమార్చి నీవు దీటుగా వచ్చావు

నాటి గాయాలింక మానలేదిప్పటికి
బూటకపు గారడీ నిలువబోదెప్పటికి

# అపశ్రుతులు

ఇకపాడకు నీపాటను
వెకలించకు రాగాలను
ఇకపాడకు నీపాటను
పకపకమని నవ్వుదురంత

పాటలోని ఆంతర్యం
బైటబడెను ఊరుకొమ్మ
పాటలోని మాధుర్యం
పరికించితిమోయి బాబు

బేజారై నీపాటకు
వీనులన్ని గడలుబట్టె
విసిగి విసిగి నీపాటకు
వేసరిల్లి పోయినాము

క్రొత్తవీణ చేతబూని
బొత్తిగానె రూపుమార్చి
మేళవించి శృతులన్నియు
మీటుచుంటి విపుడు తిరిగి

ఇందులోను క్రొత్తలేదు
ఇదిసైతం పాతపాటె
ఇందులోను ఏమున్నది
ఇదిసైతం రసహీనం

నిలుపవోయి పుణ్యముండు
నీకబ్బదు గాంధర్వం
ఆపవోయి నీపాటను
కోపమేల దయచేసి

# తన్మయత్వం

నాజాతి చరితలను
నాపూర్వ గాథలను
ఏవిధము వ్రాయాలి
ఏతీరు పాడాలి
కలము నడుపగ లేను
కంఠమెత్తగ లేను

నా ఆంధ్ర సంస్కృతిని
నా తెలుగు వెలుగులను
ఏవిధము లిఖియింతు
ఏతీరు కీర్తింతు
కలము సాగుట లేదు
గళము చాలుట లేదు

నవ్యాంధ్ర రాష్ట్రాన
దివ్య దీపాలతో
ముక్కోటి నా ప్రజలు
ఒక్క వేదికపైన
నిలుచుండి భారతికి
నీరాజనముఁ లెత్త
నామేను పులకించి
నన్ను ముగ్ధుని జేసె

నా పురావైభవ
ప్రాభవము లొకసారి

విద్యుల్లతలవోలె
విస్ఫారి మెరవగా
తన్మయత్వము చేత
తబ్బిబ్బు పడిపోతి

ఏవిధము వ్రాయాలి
ఏతీరు పాడాలి
నాజాతి చరితలను
నాపూర్వ గాథలను

# ఆత్మార్పణం

నేనొక కర్షకుడనే ఐతే—
అంబుదాలు తొంగిచూడ
నటువంటి సహారాలో
నందన వనముల నాటీ
నయనోత్సవ మొనరింతును

నేనొక విజ్ఞానినే ఐతే—
మనస్పర్థలు బలిసిపోయి
మానవత్వం చచ్చిపోతే
'ఆటం'లో అమృతంతీసి
అమరత్వం చేకూరుస్తాన్

నేనొక మాంత్రికుడనే ఐతే—
నాగరకత పేరు చెప్పక
నాట్యమాడే మూగదయ్యం
కేకబెట్టగ గొంతు బిసికి
నాకలోకపు దీప్తినిత్తును

నేనొక కవిరాజునే ఐతే—
వేవెలుంగు లీనునట్లు
విశ్వాకీల వెలుగుటకై
నాదుధిరము నంత పిండి
ధారబోతు తైలముగా

# భిన్న రాగాలు

దినకరుని మధ్యాహ్న
తీక్ష్ణాతపము జాడ
రేరాజు కేమెరుక
రేల శ్వాసలు దప్ప

కలువ పూవుల నృత్య
గానముల సోయగము
భాస్కరుం డేమెరుగు
పగటి ఆర్పులు దప్ప

కోకిలమ్మల మధుర
కూజితమ్ముల బాణి
శిశిరమ్ము కేమెరుక
జీర్ణ గళములుదప్ప

అణుబాంబు విషదంష్ట్రి
లవనినంతను విపుల
ప్రేతభూమిగ మార్చి
భూతాలతో నింపు

నని బుద్ధుడే మెరుగు
''అష్టపథి'' యే తప్ప?

పీతాల పంపకపు
బేరాలు కుదురక

నాయకమ్మన్యులు వి
నాయకులుగా మారి
ప్రజల నెత్తుటి కూడు
భుజియింతురని నేడు
బాపూజి కేమెరుక
భవ్య మార్గమె తప్ప

# దగ్ధకంఠం

మా యింటి మల్లెచెట్టు
విరగబూసినట్టి పూలు
ననుజూస్తూ వెక్కిరిస్తు
వెటకారంగా నవ్వాయి

తొట్టెలోని పాపాయిని
ముద్దులాడబోవుసరికి
కెవ్వుమనుచు కేకవేసి
మొగము తిప్పుకున్నాడు

గేయమొకటి వ్రాయాలని
కలముబట్టి కూర్చుంటే
బల్లమీది సిరాబుడ్డి
క్రింద జారి ఫెడేలు మన్నది

అడుగంటిన ఆశయాలు
అణగారిన ఆశలతో
రోడ్డుప్రక్క చెట్టునీడ
దీనంగా నిలుచుంటే
ప్రభంజనం వీచి నాదు
పైన దుమ్ము గప్పింది

గమ్యమేదొ చేరాలని
స్టేషన్‌దాక వెళ్ళుసరికి
'లేట్' అయింది జీవితాన
'ట్రెయిన్' దాటిపోయింది

# ప్రభాతాంజలి

అదిగదిగో అరుణబింబ
ముదయించెను తూర్పుదిక్కు
సుప్రభాత సుమనోజ్వల
సురుచిర కాంతులు చిమ్మెను

మలయానిల మంద మంద
వలయమ్ములు సంభ్రమింప
నామానసమందేదో
నవతాభావము పూసెను

మూడుకోట్ల జాతీయుల
ముడివేసితి నన్నట్టుగ
తెలుగుధ్వజం తిరిగి నేడు
వెలుగులతో పరుగులతో
నా దేశపు నడిగడ్డన
నాటుక రెపరెపలాడుచు
అంబరమును చుంబించగ
అంజలి ఘటియింతు నేను

# తిరోగమనం

మానవ మేధస్సునుండి
హాలాహలం పొంగుతున్నది
మానవ మేధస్సులోన
కోలాహలం జరుగుతున్నది

మానవ మానసక్షేత్రం
సంగ్రామ కురుక్షేత్రం
మానవ మానసక్షేత్రం
నిటలాక్షు తృతీయ నేత్రం

మానవ మస్తిష్కంలో
అణువులు ప్రసవిస్తున్నయ్
అణువణువున ప్రళయ శక్తి
అవతారం పొందుతున్నది

మానవమేధస్సు తోలు
కప్పుకుంట నంటున్నది
మానవమేధస్సు పచ్చి
నరమాంసం మెక్కుతున్నది

సౌధోపరి భాగాల్లో
సంసారం వద్దంటున్నది
కొండ గుహల చీకట్లో
ఉండిపోద మంటున్నది

# కాళ్లు విరిగిన వేటకుక్క

కట్టలను గుట్టలను
తెగ్రించింది తుగ్రించింది
వరదలై వాగులై
ఏరులై సాగింది
దక్షిణ కొరియా ప్రజా
వాహినీ ఉప్పొంగి
మిన్నెగిసి పారింది
మన్నంత నిండింది

కొరియా ప్రజా వాహి
నికి తలయొగ్గి "త్వమే
వ శరణమ్మ"ని నాడు
సింగ్మనిగ్రీ—

లక్షలాది ప్రజల
రక్తాన్ని పీల్చేసి
దాక్షిణ్యమే లేక
కుక్షినింపిన ప్రభుత
నెదిరించి పోరాడి
దక్షిణ కొరియా ప్రజలు
కాళ్ళువిరిగిన వేట
కుక్కగా జేశారు
సంకెళ్ల బంధించి
పండ్లూడదీశారు

హత్యలూ దోపిళ్లు
చెరసాల బందీలు
గావించి రెండవ
నరకాసురుని బోలు
సింగ్మనిని పీఠాన్ని
పెకలించి వేశారు
పీక నులిమేశారు

ఎదిరి శక్తిని తెలిసి
కానలేక సింగ్మనిని
డాలు బల్లెం బట్టి
కదనాని కురికాడు

జనశక్తి మేల్కొంది
పోరుకై కదిలింది
జనశక్తి కదిలింది
నిజశక్తి జూపింది

నిజము కనుగొన్నాడు
నిబ్బరము వదిలాడు

పాచికలు పారవను
కొన్నాడు సింగ్మనిని

కొరివితో తలగోకు
కొనుటగా తలచాడు
డాలు బల్లెం వీడి
దాసోహమన్నాడు

కండ కావర మంత
కరిగింది అన్నాడు

# ఆషాఢ పయోదం

సాగిరావే మేఘమాలా!
రాగరంజిత జలదమాలా!

ఏడ బుట్టితి వీవు
ఏడ బెరిగితి వీవు
ఆషాఢ మేతెంచ

అంబరము నెక్కితివి
ఏ తల్లి ముత్యాల
చీర కొంగును బట్టి
తడబడుచు అడుగులిడి
నడయాడ నేర్చితో
అలనాటి మా కాళి
దాసు దౌత్యము నెరపి
అలకాపురము కేగి
వార్త జేర్చితి వీవు

నీవు నడిచెడు బాట
నీవు దిరిగెడు చోట
పాషాణములలోన
పంచదారలు పండు
జీర్ణ దేహములందు
జీవనాడులు పొంగు

భగ్నజీవులలోని
అగ్నికీలల గాంచి
జాలిగుండెను విప్పి
జార్చెవు కన్నీరు

మాట పెగులని దీన
మానవావళికొరకు
బిట్టుగా అరిచేవు
పిడుగులను రాల్చేవు

జగతికని సాయమ్ము
జరుప నీ కాయమ్ము
కర్పూర కళికగా
అర్పణము జేసేవు

మనిషిలో లేనట్టి
మరులు నీలో గలవు
సాగిరావే మేఘమాలా!
రాగరంజిత జలదమాలా!

# పతాకారోహణం

ఎగిరింది ఎగిరింది మూడు వన్నెల జండ
నింగినంటే దాక పాకింది జండ

అమృత భాండము కొరకు
అమరేంద్రుని గెలుచుటకు
ఖగనాథు డంబరము
కెగసిపోయినయట్లు

అంజనీతనయుండు
సంజీవి దెచ్చుటకు
లంఘించి మింటిపై
పొంగి లేచినయట్లు
పాలసంద్రము త్రిచ్చు

వేళ సంభ్రమముతో
క్షీరాబ్ధిలో నుండి
సిరిలేచినట్లుగా

హిమగిరీంద్రుని పట్టి
సుమమాలికలు చుట్టి
ఈశాను తలపైకి
విసిరి వేసినయట్లు

స్వాతంత్ర్య భారతపు
జనవరిరువదియాదు

నాటి వేడుక గాంచి
నాకమ్ము దిగివచ్చి
సురభామినులు మింట
చరియించినట్లుగా

ఇంటింటి కొక జండ
హృదయమే ఉప్పొంగ
ఎగిరింది ఎగిరింది మూడువన్నెల జండ
నింగినంటేదాక పాకింది జండ

# మహావిష్ణువు మరణం

శ్రీ మహావిష్ణువుకు
'సుస్తీ' చేసిందట
టెంపరేచర్ నూట ఆరు
డిగ్రీలకు పెరిగిందట
ధన్వంతరి తనచేతిక్రింది
కంపౌండర్‌ను పంపించి
బిల్లు చెల్లిస్తేనే ఇకముందు
మందులు ఇవ్వడం జరుగుతుందని
కబురు చేశాడు

ధనాధిపుని దగ్గరకు
అప్పుకని లక్ష్మీదేవిని
పంపిస్తే—
పాత బకాయిల ప్రసక్తి తెచ్చి
చిల్లిగవ్వైనా దొరకదని
మొగమాటం లేకుండా
త్రిప్పి పంపాడు

గరుత్మంతుడు
తన నెలజీతం అడగడానికి
టైం ఎప్పుడు చిక్కుతుందానని
తొంగి తొంగి చూస్తూ
కాచుక్కూర్చున్నాడు

వైకుంఠంలో
ఏమూల చూసినా
గుసగుసలు ప్రారంభమయ్యాయి
పొలిటీషియనులు
అత్యవసర సమావేశాలు
ఏవో జరుపుకుంటున్నారు
తగిన వారసునికోసం
అప్పుడే ప్రారంభమైంది గాలింపు

స్వర్గలోకంలో
ఊర్వశీనృత్యానికి
రావలసిందిగా
ఇంద్రుడు అందరికీ
ఆహ్వానాలు పంపించాడు

వచ్చే రావడమే నారదుడు
ఛాన్స్ కొట్టేశావని
అభినందనలు తెలిపి
ఇంద్రుని సరసనే కూర్చున్నాడు
తుంబురుని పని పట్టించాలని

బృహస్పతి పంచరత్నాలతో
ప్రారంభమైంది సభాకార్యక్రమం
ఆనాడు బ్రహ్మదేవునిచే
సృష్టింపబడిన వారంతా
మహదానంద సంభరితులూ
అష్టైశ్వర్య సంపన్నులూగా
అవతరించారు భూలోకంలో

నాటిసాయంత్రం కైలాసంలో
మహానటుని నాట్యం
చూచివస్తున్న దేవతలు
అపూర్వంగా ఉందని
పొగడుతున్నారు

తెల్లవారి—
'మహా విష్ణువు మరణం'
అన్నవార్త రేడియో
బ్రాడ్‌కాస్ట్ చేసింది

మరునాడు—
సంతాప తీర్మానాలతో
కవికుమారుల శ్రద్ధాంజలులతో
పెక్కుచోట్ల సభలూ
సమావేశాలు జరిగినట్లు
పతాక శీర్షికలతో
పత్రికావార్త

మరోనాడు—
పూర్వసువాసిని శ్రీ మహాలక్ష్మిదేవిని
వైకుంఠంనుండి బహిష్కరించినట్లు
అధికార ముద్రతో ఆర్డినెన్స్

# దినచర్య

బ్రతుకుటిరుకు బాటలోన
తుమ్మచెట్లు మొలిచినాయి
బ్రతుకు పూలతోటలోన
ముండ్లపొదలు పెరిగినాయి

మరలిపొండి మరలిపొండి
మరోదారి చూసుకోండి
మరోతోట నాటుకోండి

గుడ్లగూబలు పట్టపగలే
క్రొత్త రాజ్యాంగాన్ని విరచిస్తున్నాయి
విషనాగులు బుసలుకొడుతూ
కొన తోకలపై ఆడుతున్నాయి

కర్కశాలు కార్పణ్యాలు
గూళ్ళు కడుతున్నాయి
కొటారు కొమ్మలపైన
వృద్ధజంబుకాలు గద్దెనెక్కి
ప్రారంభించాయి ఉపన్యాసాలు

మండూకం గళంనొక్కి
మ్రింగబోయే కాలభుజంగాన్ని
తన్నుకపోయింది గద్ద
వానకాలం గనుకవస్తే

ఆకలి తీరుచేలాగని
చీమలు చేర వేస్తున్నాయి తిండికని

ప్రస్తుతానికి ఏమీ దొరకడంలేదని
పస్తులున్న పిచ్చుకలు
ఏడుస్తున్నాయి మరోపక్క

చిలుకలు కోకిలలు
పదవులకు రాజీనామాలుచేసి
పికెటింగ్ ప్రారంభించాయి

ఉదారులు దేబెమొగాలు
నల్లద్దాల బోనులో
చిక్కుక పోయారు

మోసం కోరమీసాలు పెంచి
దబాయిస్తున్నది పరిసరాలను
అధికారుల హస్తముద్రలు
అమ్ముడుబోతున్నాయి అంగట్లో

మలేరియా బీమారీలకు
మందులు 'ఫ్రీ'గా
పంచిపెడుతున్నాయి దోమలు
చెప్పేదేమున్నది భాయీ
దినమంతా ఇదే లడాయీ

# మేల్కొన్న శవాలు

శవాలు మేల్కొంటున్నయ్
శవాలు లేచి నిల్చుంటున్నయ్
శవాల్లో జీవకలలు తొంగిచూస్తున్నయ్
చిత్రింగాలేదూ?

గాలీవెల్తురులు లేని
గదిలోపల మూయబడ్డ
కూడూగుడ్డా లేని
గోరీల్లో దాచబడ్డ
శవాలు నిటారుగా నిల్చుంటున్నాయ్
వొళ్ళువిరిచి నడుస్తున్నయ్
శవాలు మాట్లాడుకుంటున్నయ్

యుగయుగాయిగా
భూవలయంలో పాతిపెట్టబడ్డ
కళేబరాలు గుసగుసలు ప్రారంభించినై
పుడమిగర్భం చీలుస్తూ
ఒక్కటొకటే బయటపడుతున్నయ్

తుప్పుపట్టిన తలలకు
చీకాయపొడి రాస్తున్నయ్
బూజుబట్టిన కళ్లను
టవల్ తో తుడుచుకుంటున్నయ్

శరీరాన్ని చితగ్గొట్టిన
రాబందులను బట్టి
నిర్దాక్షిణ్యంగా పీక్కు-తిన్న
"కరటకదమనకు"లను బట్టి
ఉరిశిక్షలు వేస్తున్నయ్

ఈప్రాంతానికంతా
అధినాథులమని
బింకంగా తిరిగిన సైతానులను
కొరడాలతో కొడుతుంటే
పొలిమేరలుదాటి
'పశ్చిమానికి' దౌడుతీస్తున్నయ్

కళేబరాలన్ని సమావేశమై
మనుస్మృతులకూమానవత్వానికీ
క్రొత్తవ్యాఖ్యానాలు వ్రాస్తున్నయ్
క్రొత్తనిర్వచనాలిస్తున్నయ్
చాణుక్యుని రాజనీతిశాస్త్రానికి
సవరణలు తీసుకవస్తున్నయ్
శ్మశానాన్ని సమతాచిహ్నంగా
శాంతినికేతనంగా మారుస్తున్నయ్
చిత్రంగాలేదూ?

# వీడ్కోలు సందేశం

చంద్రలోకం చేరడానికి
సాగిపోయే మానవా
అర్జీ ఒకటున్నదోయి
ఆలకించి వింటావా!

గతచరిత్ర గాథలన్ని
వెతికిచూస్తె ఏమున్నది
ప్రతినిత్యం చిచ్చులతో
ప్రళయసమర సంఘర్షణ

తాజమహల్ ఒకనాటికి
బూజుపట్టి పోవుననుచు
సింధునదీ లోయలోని
శిథిలాలే నిరూపించు

కత్తులతో కంచెనాటి
కలకాలం మనదలచిన
అస్సీరియ బాబిలోనియ
వైభవోన్నతు లేమైనవి

ఎఱ్ఱకోట బురుజుమీద
ఎగిరిన పతాకలెన్నో
రారాజుల విజయానికి
రాలినశీర్షము లెన్నో

జనహృదయం నెదిరించిన
జనహృదయం పీడించిన
షెహిన్షాల సల్తనతులు
తుగులక్కుల హుకూమతులు
చరిత్రకుండి నిష్క్రమణం
జరుపక తప్పిందికాదు

రాతియుగంనుండి నేటి
రాకెట్ దాక నడిపించిన
మానవుడా! చరిత్రగతిని
ఆవృత్తం కానీయకు

ప్రాక్తనకర్మబలంచే
రావణసంతతి వారలు
ముసోలిని హిట్లరులూ
ఉదయింతురు సుమా అచట
పితార్జిత విజ్ఞానం

విషతుల్యం కానీయకు
మానవచరిత్ర గతిలో
కానరాని చీకటిగదిలో
మూల్గుతున్న కళేబరాల
నోదార్చుట నేర్చుకో

జయం జయం జయం నీకు
జయం జయం మానవుడా!
సాగింపుము సాగింపుము
చంద్రలోక జైత్రయాత్ర!

# గావుకేక

నాలక్ష్యమును చేర
నన్నుబోనివ్వండి
నాదారి నన్నంటి
నడుచుకోనివ్వండి

మార్గమునకొక లక్ష్య
మంటు ఉండకపోదు
గమ్యాన్ని చేరగల
గట్టినమ్మకముంది

దయచేసి నాకడ్డు
దారిలో నిలువకుడు
విన్నవింతును మీకు
తిన్నగాబోనీండి

మాటిమాటికి నన్ను
మాటలనబోకండి
కూర్చున్న చోటనే
గోతులను త్రివ్వకుడు

నామంచి చెడులతో
ఏమంత పని మీకు
పెద్దగా నన్నెదో
ఉద్ధరించినయట్లు

ఔన్నత్యమును జూచి
హర్షించలేదుమరి
నాదీనతనుజూచి
నవ్వుకొందురుగాని

# నగ్నదృశ్యాలు

వెలిపోయిన మొగములందున
పాలవెల్లులు పొంగగలవా?

కాలిపోయిన వల్లరులలో
పూలగుత్తులు పూయగలవా?

దగ్ధజీవుల ఎదల లోపల
స్నిగ్ధరేఖలు మొలువగలవా?

క్షుద్ధమానవ మానసమ్మున
దుగ్ధబిందువులొలుక గలవా?

మూగగొంతులు స్వరముగలిపిన
రాగములు వినిపింపగలవా?

నిగళబంధిత పదయుగమ్ములు
నగరవీధులు తిరుగగలవా?

నిశ్చలాంబుధి ఉరస్థలిపై
నీటితుంపురులెగయగలవా?

పొగలుచూరెడు కుడ్యములపై
నగిసిబొమ్మలు నిలువగలవా?

కుంగు గుడిసెల నీలినీడలు
కోటగోడలు ప్రాకగలవా?

చావుబ్రతుకుల సందెలందున
శాంతిబేరాల్ సాగగలవా?

# దివాంధముల స్వగతం

అరెరే! అప్పుడే తెల్లవారుతున్నది
అందుకే కండ్లపై మసకలు క్రమ్ముతున్నాయి

ఇదంతా మేమెరక్కుండానే జరుగుతున్నది
ఎవడిచ్చాడీఅధికారం సూర్యుడికి?

తీర్మానాలు ఖరార్నామాలేమైనా ఉన్నాయా
ఆకాశంపై యథేచ్ఛగా విహరించడానికి?
తెల్లవారడం మాకు ప్రాణసంకటమని
వీడికి బుద్ధుండవద్దూ?

ప్రజాభిప్రాయమూ
దేశాభ్యుదయమూ అన్నీమరిచి
మజాచేస్తున్నాడేం వీడితెలివితెల్లవార?

'డెమోక్రసీ'లో 'మైనారిటీ' లక్కాడ
హక్కులరక్షణకు అభయమివ్వబడునన్న
ప్రాథమికసూత్రాలే ఎరుగడేం దొంగవెధవ?

ఇంతకూ మాకుసైతం 'మెజారిటీ' లేదనా
పెద్దపిట్టలు దోమలు నల్లులు
కోటానుకోట్ల గబ్బిలాలు
నరవాసన సహించని తీతువుపిట్టలు
వీళ్లంతా మాకోటిలోనివారే
అంతాకలిసి మూడింట రెండువంతులు

ఆహా! చీకట్లంటే ఎంతమనోహరం!
ప్రకృతితల్లి ఉరముపైని
నీలికాంతమణిహారం
వీడిమొఖం ఎన్నడైనచూశాడూ చీకటిని?

ఇదంతా నియంతృత్వం నిరంకుశత్వం
కాదంటేమేకపోతు గాంభీర్యం
ఇలైతేఅవుతుంది 'డెమోక్రసీ ఫేయిల్'
త్వరలోనే 'మ్యాగ్నాకార్టా' లిఖింపజేస్తాం

అరే కండ్లు పూర్తిగా కానరావేం!
వీడిదౌర్జన్యం మండిపోనూ!
అప్పుడేనెత్తిపై కెక్కాడేమొ
ఊఁ కానీ! సుఖదుఃఖాలు రెండూ
కావడికుండలేకదూ

'ఆదిత్య హృదయం' పట్టుకురండరా్రి
ఆరాధన జరిపించేద్దాం
మిత్రుడా! నిన్నే నమ్ముకున్నాం
పాహిమాం పాహిమాం

# వేదన

సాగర సంగీతం

ఈయాత్ర చిరకాలం
ఇలాగే సాగుతుందని
ఎదలో భ్రాంతిపడినాను

ఆనందమగ్న మానసుడనై
స్వప్న లోకాలలో
తేలిపోయినాను

నాపథాన నేటివరకు
విషమ ఝంఝానిలములా
వీచలేదు
వక్రగతులులేవు
అడ్డదారులు లేవు
కఠిన కంటకాకీర్ణ మార్గమా?
కానేకాదు
పాలరాతితో వేసిన రాచబాట

ఈపథము
అలాగే సాగిసాగి
ఆగిపోయెను
బహుజనాకీర్ణ
మధ్యశృంగాటకమున
దారితోచదు
చూపించువాడులేడు

శ్రీ ద్వారం జగన్నాథ

పలుకరించడు—
పిలిచినపలుకడెవడు

పొద్దుదిరుగుడు.
పూవులాంటి జనుల
తొక్కిసలాట మధ్య
కాలు నిలుపుటకైన
కాసంతచోటులేదు

తిరిగిపోదామన్న
అదికాస్త—
వన్‌వే ట్రాఫికంట
దారిజూపించు
దరిజేర్చుకొనుము స్వామి!

# నివేదన

సాగరసంగీతం

నాజీవితంలో
'సరిగమ'లు తప్పింది నేడు
నాజీవితానికి
'సడెన్‌బ్రేక్' పడింది చూడు

నిరాశానిస్పృహలు నాలో
కళ్ళెంవిడిచిన తురంగంలా
కడలిలోని తరంగంలా
రాజమార్గంగుండా ఉరికే
రాజుగారి మోటారుకారులా
రావణాసురుడు పంపిన
బంగరులేడిలా
అంతులేని వేగంతో
గంతులువేస్తున్నయ్

మంచులా ముద్దకట్టిన జీవితం
మందాకినిలా ప్రవహించడానికి
మిడుతలవలె దండెత్తే
నిర్భరనిరాశా నిస్పృహలు
మాడిపోయి మసిబొగ్గుగ
మారునట్లు నాఎదలో
ఆరిపోని చిరుదివ్వెను
వెలిగింపుము నాస్వామి.

శ్రీ ర్వారంజగన్నాథం

# ఆశాకిరణం

లోకాలముంచెత్తి రాకాసిరాత్రుళ్ళు
ఆకాశమంతటను అలుముకొన్నవి నేడు
కాలమేఘాలన్ని క్రమ్ముకొని వచ్చేసె
నా నిశానాథుండు కనుపింపడీ వేళ

నాల్గు దిక్కుల నుండి భగ్నజీవులకేక
ననుజేర వచ్చెడు విషాదాగ్నుల కాక
అన్ని వైపుల నుండి తెగిన తీగెల మ్రోత
అన్నిటికిని మించు అపశబ్దముల రోత

భావ వీధుల్లోన పరుగులిడుదామన్న
బాటలే తెలియక బాధపడుచున్నాను
నేను గట్టిన గాలి మేడలన్నియు కూలి
మన్ను నంటీ నన్ను వెక్కిరిస్తున్నాయి

కష్టాలుపడి ఎన్నో నష్టాలు భరియించి
నా ఎదలో పూదోట నాటుకొంటేనూ
చిత్రమేమో కాని మంత్రమూదినయట్లు
వాడి వత్తులుగాగ వసుధనంటెను పూలు

నా హృదయ సౌధంలో నైరాశ్య భూతాలు
నాట్యమాడు విధాన గంతులేస్తున్నాయి
నావిన్న కథలన్ని వెతలయ్యి పోయాయి
నాకన్న కలలన్ని కల్లలై నిలిచాయి.

ఆప్తులందరి బాసి అంధకారములోన
ఎందరికొ దూరమై ఏకాకి నైపోతి
భయముతో నా ఒళ్లు వణకిపోతుంటేను
పెనుతుఫానే వీచి దుమ్మెత్తి పోసింది

మంద భాగ్యుడనైతి మరి బ్రతుకు టింకేల
ప్రాణాలపై తీపి వదులుకొనుటే మేలు
అని వగచుచుండంగ అల్లంత దూరాన
ఎత్తైన కొండపై వెలుగు రేకలు తోచె

సాగర సంగీతం

పేర్వారం జగన్నాథం

# వర్షబిందువు

ధారాధర గగనంలో
కాలరాత్రి వదనంలో
నిశ్వమెల్ల మైమరచీ
విశ్వసించు సమయమ్మది

కాలమేఘ ఘర్షణలకు
కదన సమయ శస్త్రములై
నిర్ఘాతములంత కంత
నిండుకొనె నజాండమెల్ల

నలుదిక్కులు ఏ కమ్మగు
నన్నట్లుగ వీచుచున్న
పెనుగాలికి భూగోళం
వణకుచుండె గడగడమని

కుండపగిలి పోయినట్లు
మెండుగాను వర్షధార
కార్మబ్బుల వీడివచ్చి
హోరంచును కురియసాగె

బిందు వొకటి ఆధారను
వీడిపోయి మధ్యలోనె
పడిపోవుచు తన గుండెల
దడదడలను అదిమినాది —

పేర్వారం జగన్నాథం

“ఏ నగముల జేరుదునో
ఏ వనముల రాలుదునో
ఏ పక్షులు నను ద్రావునా
ఏ మృగాలు నను మ్రింగునా

సంద్రంలో రాలుదునో
సరిత్తులో కలియుదునో
కూపంలో కూలుదునో
రూపంచెడి పడిపోదునా

జీవితాన నైష్ఫల్యం
చెందకున్న చాలునాకు
వ్యర్థజీవితాన్ని గడిపి
పర దూషణ పాలుగాను”

కానున్నది ఎవడెరుగును
కమ్రి శుక్తిలోననుబడి
ఆ బిందువు ముత్యముగా
అతితేజమ్మందినాది.

# ప్రతిజ్ఞ



కలందించేది లేదు
కలం వంచేది లేదు
విషనాగుల గళం నుండి
పీయూషం పిండు వరకు
పాషాణపు పొరల్లోన
పాలవెల్లి పొంగు వరకు
క్రోధానల నయనాల్లో
కుసుమమ్ములు పూయు వరకు
నిరుపేదల గుండెల్లో
నిప్పురవలు వెలుగు వరకు
జడ జగత్తు నిదురలేపి
జాగృతి గలిగించు వరకు
స్వప్నలోక సౌధాలకు
రహదారులు వేయు వరకు
కలందించేది లేదు
కలం వంచేది లేదు

# ఏడుకొండలా యెంకన్నా

సాగర సంగీతం

ఏడుకొండలా 'యెంకన్నా'
డూడూ డూడూ 'బసవన్నా'

తెలంగాణమని బజారులన్నీ
'గోల'లు చేస్తూ 'కొండ' లెక్కుతూ
పాండు 'రంగ' నీ భజనలు జేస్తూ
మొండిగ వాదం చేసే వారికి
గుండెలాగెనే 'యెంకన్నా'
లండుకు చెడిరే 'బసవన్నా' ఏడు॥

'నారసింహు'ని ఉగ్రతాండవము
'చెన్న' బసవనీ పన్నాగంబులు
హైకమాండు వారాదేశించిన
ఆజ్ఞలతోనే అంతమొందగా
'నల్ల' మొగాలతొ 'యెంకన్నా'
'అల్ల'ను వేడిరె 'బసవన్నా' ఏడు॥

విశాలాంధ్రకై సదస్సు లెన్నో
విజయ శంఖముల పూరిస్తుంటే
'నూకలు' కరువని వగచే వారికి
నౌకరి లేదని ఏడ్చే వారికి
వరంబులివ్వర 'యెంకన్నా'
ధైర్యము జెప్పర 'బసవన్నా' ఏడు॥

పేర్వారం జగన్నాథం

# అగ్రరాజ్య చతుష్టయం

సా
గ
ర
సం
గీ
తం

చంద్రబింబం జారిపడితే
జగత్తు చిత్రంగా చూడదూ
కావ్య వస్తువు దొరికిందని
కంఠాలు విప్పేరు కవులు

యువ దంపతులంత గలిసి
వెన్నెల వాగుల్లో ఈదాలని
మూగుతారు చంద్రుడి చుట్టు

చకోరాలు అమృతాంశుని
శీతల కిరణామృత ధారాపానం
చేయాలని రెక్కలపురి విప్పివచ్చి
వాలుతాయి చంద్రుడిపై

అద్దంలో ప్రతి నిత్యం
కనిపించే మామయ్య
నా కోసం వచ్చాడని వెన్ను నెక్కి
"చలోఢిల్లీ" మామా యని
పొడుస్తాడు కుర్రోడు

చంద్రమండలానికి రాకెట్లు పంపి
సంసారం చేద్దామనుకున్న శాస్త్రజ్ఞులు
మేధావులు అతిరథ మహారథులు
సునాయాసంగా కానీ ఖర్చు లేకుండా
సమస్య ఫైసలా అయినందుకు
సంతోషం ప్రకటిస్తారు

పే
ర్వా
రం
జ
గ
న్నా
థం

లేబరేటరీలపై జండాలు ఎగరేసి
అంతా మన కృషి ఫలితమే నంటారు
"నో అడ్మిషన్" బోర్డు కట్టి
అధిరోహిస్తారు చంద్రమండలాన్ని

యువ దంపతులు చకోరాలు
ముద్దుల పాపాయి ముసలి శాస్త్రజ్ఞులు
హక్కులు కావాలని
అంతా మాదేనని
దెబ్బలాడ సాగుతారు

అప్పుడు—
అధికారం చలాయించడానికి
హద్దులు పరిరక్షించుకోవడానికి
ప్రభుత్వాల కంట్రోళ్ల

"ప్రప్రథమంగా
రాకెట్ పంపింది మేమే"నని
తయారవుతుంది రష్యా

"జారిపడ్డ భూభాగం
మాదికాదా మరి" అంటూ
తగవులాడు అమెరికా

"మీ ఇద్దరికీ లేదు పొత్తు
చంద్రుడు జారిపడడం
మొట్టమొదట కనిపెట్టింది
మేమే"నంటూ
బుకాయిస్తుంది గ్రేట్ బ్రిటన్

"ఎందుకులే అన్నయ్యా
నీకు నాకు వైరములు
నాకు కాస్త చోటిస్తే
తాళం నీకే వేస్తా"నని
సమర్థిస్తుంది ఫ్రాన్స్

# కన్నీటి కథ

సాగర సంగీతం

మైథిలీనయనాల నుండి
జారి పడిన నా కవోష్ణ బిందువులు
దశకంఠు పదితలలు
ధరణివ్రాలగజేసె

రాజరాజు నిండు కొలువులో
వలువలూడ్చబడిన ద్రౌపది
కాగిన కన్నీటి కణాలు
కౌరవ కాంతారాన్నే కాల్చెను

మూడుకన్నులవాని ముదితశాంకరి
కార్చిన కన్నీటి ధారలే
అగ్నికీలలై పైకెగసి
దక్షు గర్వభంగముజేసె

సతీ వియోగ దుఃఖంతో
అలమటించు షాజహాను
అశ్రుబిందువులతో తడిసిన
మంటిపెల్ల తాజమహల్గా మారెను

నేనొక వియోగినీ కనులనుండి
పారిపారి ఏరుగా మారి

పేర్వారం జగన్నాథం

కడలి తరగలలోన
కలిసి కరిగిపోయి
ఆతపచండ కిరణాలకు
ఆవిరినై ఆకసమంటి
మేఘాన్నై—
ఆషాఢపు మేఘాన్నై
కాళిదాసు కావ్యానికి
కాళ్లలేని దూతనైతి.

త్వరలో రానున్న
రచయిత ఇతర గ్రంథాలు

1. సాహిత్యావలోకనం
(సాహిత్య వ్యాస సంపుటి)

2. వృషభ పురాణం
(అధిక్షేపాత్మక వచన కవితా సంపుటి)

3. గరుడ పురాణం
(అధిక్షేపాత్మక వచన కవితా సంపుటి)

# పేర్వారం జగన్నాథం

| | | |
|---|---|---|
| జననం | : | 23-8-1934 |
| తల్లి | : | సయ్యమ్మ |
| తండ్రి | : | సంతాజి |
| జన్మస్థలం | : | ఖిలాషాహపురం, తా॥ జనగామ<br>జి॥ వరంగల్లు, ఆం. ప్ర. |
| విద్యాభ్యాసం | : | ఖిలాషాహపురం-ప్రాథమిక విద్య<br>జనగామ-మాధ్యమిక విద్య<br>హనుమకొండ-ఉన్నత విద్య, ఇంటర్మీడియేట్<br>హైదరాబాదు-బి. ఏ; ఎం. ఏ. |
| వృత్తి | : | కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు<br>తెలుగు శాఖలో రీడర్ |
| అభిరుచులు | : | కవితారచన, సాహిత్య సాంస్కృతిక సంస్థలతో<br>సంబంధం పెంచుకోవడం, ఆధునిక సాహిత్య<br>ప్రక్రియలపై మక్కువ చూపడం |
| అలవాట్లు | : | సమకాలిక సమాజచరిత్రను అధిక్షేపాత్మకంగా,<br>హాస్యరసోచితంగా చిత్రించడం |
| పదవులు | : | సంయుక్తకార్యదర్శి<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ-హైదరాబాదు<br>కార్యవర్గసభ్యుడు, ఆంధ్రసారస్వతపరిషత్తు-హైదరాబాదు<br>''సాహితీ బంధుబృందం'' ''చైతన్యసాహితి''<br>సంస్థలతో అవినాభావసంబంధం<br>ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థిగా ఉన్న కాలంలో<br>తెలుగుపత్రిక ''శోభ''కు సంపాదకుడు<br>''తెలుగు సారస్వతసమితి'' కి అధ్యక్షుడు |
| పరిశోధనారంగం | : | ఆరెభాషాసాహిత్యసంస్కృతులు<br>''చేతనావర్తం'' కవులలో ఒకరు |

—ప్రకాశకులు